# చందమామ

పిల్లల కథల మాసపత్రిక



1st May '60

50 NAYE PAISE

8

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

జాతికి రత్నం గాంధీ సత్యం

పంపినవారు:
R. A. V. R. మూర్తి - వైజాగ్

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.


ఆంధ్రప్రదేశ్
అన్ని ముఖ్య కేంద్రాలలో
ఇప్పుడు ప్రదర్శింపబడుతూంది!
జెమిని వారి మహత్తర సాంఘిక చిత్రం
పైగాం
(సందేశం)
దిలీప్ కుమార్ • వైజయంతిమాల • రాజ్ కుమార్
బి.సరోజాదేవి • పంఢరీ బాయ్ • మోతీలాల్ • జానీ వాకర్



నేడే చూడండి!
వీనస్ పిక్చర్సు
పెళ్ళికానుక
కథ-దర్శకత్వం: శ్రీధర్
సంగీతం: ఏ.యం.రాజా
నవయుగ



మనోహరమైన
ముఖలావణ్యమునకు
నేషనల్ వారి
కాశ్మీర్ స్నో
Kashmir
సినిమా
తార లందరకు
నచ్చినది
ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 • మదరాసు-1




అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము !!
FOR Costly PENS
Iris
INKS
ఐరిస్
సిరాలు
ఫౌంటెన్ కలములకు పేరెన్నిక కన్నవి.
1, 2, 4, 12, 24 ఔన్సుల ప్యాకింగులలో లభించును.
తయారుచేయువారు:
రీసెర్చి కెమికల్ లెబొరెటరీస్
మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3


THEY ARE GOOD
IF THEY
ARE
Phenix
EWI LTD
MANUFACTURED BY
THE ENGINEERING
WORKS OF INDIA
PRIVATE LTD.
1/4C GUN FOUNDRY ROAD, CALCUTTA
4/60
CEW


సుశీల
ఇచ్చే
విందులో
విశేషమేమిటి?
MONACO
సుశీల.... పేరుకు తగ్గట్లే సౌశీల్యం కలది.
అతిథి సత్కారంలో ఆమెనే చెప్పుకోవాలి.
అతి తాజాగా, కరకర లాడుతూ వున్న
పార్లేవారి మొనాకో సాల్టెడ్ బిస్కట్లపై తీపి
పదార్థాలూ, ఆపిల్ ముక్కలూ, కోవా,
వచ్చుతూ పెట్టి ఆశ్చర్యకరంగా సత్కరిస్తుంది.
అందుకే అతిథులంతా సంతోషంగా ఆమె
నెప్పుడూ పొగుడుతుంటారు.
పార్లేవారి
మొనాకో
ఖారా బిస్కట్లు
పార్లె ప్రోడక్ట్స్ మ్యానుఫ్యాక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి-24
PP.1/MA TE EVEREST

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల "అవిమారకుడు" అనే భాసనాటక కథ ప్రచురిస్తున్నాము. దీనికి లోగడ [సెప్టెంబరు 59] ప్రచురించిన "ఆదర్శ ప్రేమికులు" ("రోమియో - జూలియెట్") కథకూ భాసుడి "అవిమారకుడు" కథకూ చాలా పోలికలున్నాయి. అయితే "రోమియో - జూలియెట్" లాగా "అవిమారకుడు" కథ విషాదాంతం కాదు, సుఖాంతం. అంతకు పూర్వమే ఉండిన ఒక జానపద కథ ఆధారంగా భాసుడి ప్రఖ్యాత నాటకాన్ని రచించినట్టు తెలుస్తున్నది.

"చరిత్ర ప్రసిద్ధ ప్రదేశాలు" అనే శీర్షికకింద ప్రచురించటానికి "చందమామ"లో ఒక పుటకు మించకుండా వ్యాసాలు పంపవలసిందిగా కిందటి సంచికలో చేసిన ప్రకటనను చూసే ఉంటారు. ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ ప్రాంతాలన్నిటిని గురించి రచనలు రావాలని మా కోరిక. అందుచేత పాఠకులు మే నెలాఖరులోగా తమకు తెలిసిన ప్రదేశాలను గురించి చక్కని రచనలు పంపుతారని ఆశిస్తున్నాము.

సంపుటి 26 : మే 1960 : సంచిక 5



# మహాభారతం

పదకొండు అక్షౌహిణుల కౌరవసేనకు నాయకుడుగా ఉండి, పదిరోజులపాటు పాండవ యోధులనూ, సైన్యాలనూ కార్చిచ్చులాగా నాశనం చేసి మహాత్ముడైన భీష్ముడు అంపశయ్యపై పడిపోగా, పాండవులు ఉత్సాహంతో శంఖాలు పూరించి, జయధ్వానాలు చేశారు; కౌరవులు గుండె దడతో కుంగిపోయి రోదించారు.

ఆరోజుకు యుద్ధం ఆగిపోయింది. కౌరవ పక్షపు సైన్యాలను యుద్ధం నిలపమని ద్రోణుడు శాసించగానే పాండవులు తమ సైన్యాలచేత యుద్ధం ఆపించారు.

ద్రోణుడికి భీష్ముడు పడిపోవటం గురించి చెప్పినవాడు దుశ్శాసనుడు. భీష్ముడు పడ్డాడని వినగానే ద్రోణుడు రథంలో కూలబడి కొయ్యబారినట్టుగా అయిపోయాడు.

తరవాత యోధులందరూ కవచాలు విప్పేసి భీష్ముడు పడిఉన్న చోటికి వచ్చి ఆయనకు ప్రణామం చేశారు. వారిలో కౌరవులూ, పాండవులూ కూడా ఉన్నారు. భీష్ముడు అందరినీ పలకరించి, "నా తల పడిపోతున్నది. తలకింద ఎవరైనా ఎత్తు పెట్టండి," అన్నాడు.

వెంటనే మెత్తమెత్తని తలగడలు తెప్పించి ఆయన తలకింద పేర్చటానికి ప్రయత్నించారు. అదిచూసి భీష్ముడు, "వీర శయ్యపై పడుకున్నవాడికి ఈ తలగడలు యుక్తమైనవి కావు. అర్జునా, నాకు తగిన ఎత్తు తలకింద అమర్చు," అన్నాడు.

అర్జునుడు మూడు బాణాలు వింటితో సంధించి, భీష్ముడి తలకింద ఎత్తుగా ఉండేలాగు భూమిలోకి కొట్టాడు. వాటిపైన భీష్ముడి తల చక్కగా నిలిచింది.

భీష్ముడు అర్జునుణ్ణి మెచ్చుకుని, "నీ పౌరుషానికీ, నా స్థితికీ తగినట్టుగా తలగడ అమర్చావు, నాయనా," అన్నాడు. తరవాత

ఆయన చుట్టూ ఉన్నవారితో, "నా చుట్టూ ఒక కందకం తవ్వించండి. నేనిక్కడ ఉత్తరాయణం వచ్చేదాకా ఒంటరిగా సూర్యుణ్ణి ధ్యానిస్తూ ఉంటాను. ఇంతటితో ఈ యుద్ధం మానెయ్యండి," అన్నాడు.

ఇంతలో అక్కడికి శస్త్రవైద్యులు ఉపకరణాలతోసహా భీష్ముడి శరీరంనుంచి బాణాలు పెరికివెయ్యటానికి వచ్చారు. అది చూసి భీష్ముడు దుర్యోధనుడితో, "నాయనా, ఈ వైద్యులకు బహుమానాలిచ్చి పంపెయ్యి. వీరితో నాకు పనిలేదు. నేనీ బాణాలతోనే మరణించటం ధర్మం. నేను పోయాక నన్ను వీటితోనే దహించండి," అన్నాడు.

తరవాత పాండవులు భీష్ముడికి ప్రదక్షిణ చేసి ఆయన చుట్టూ రక్షణ ఏర్పాటుచేసి తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. ఆ రాత్రి గడిచి మర్నాడు తెల్లవారింది. మళ్ళీ కౌరవ పాండవులు భీష్ముణ్ణి చూడవచ్చారు. అనేక వేలమంది స్త్రీలూ, వృద్ధులూ, పిల్లలూ కూడా ఆయనను చూడవచ్చి ఆయనకు గంధ పుష్పాలర్పించారు, దండలు వేశారు. నటులూ, నర్తకులూ వచ్చి వాద్యాలతో సహా ఆయనకు వినోదం కలిగించారు.

కాని భీష్ముడు చాలా బాధలో ఉన్నాడు. ఆయన ఆ బాధను బలవంతాన దాచుకుంటూ, "నాకు దాహంగా ఉన్నది," అన్నాడు. వెంటనే భోజనపదార్థాలూ, కుండలతో చల్లని పానీయాలూ వచ్చాయి. కాని భీష్ముడు తన కవి పనికిరావని చెప్పి, అర్జునుడికోసం అడిగాడు.



అర్జునుడు ఆయనను సమీపించి నమస్కరించి, "ఏమి సెలవు?" అని అడిగాడు.

"నాయనా, నీ బాణాలతో దేహమంతా నొచ్చుతున్నది. నోరు ఎండుకు పోతున్నది. నాకు తాగటానికి పనికివచ్చే నీరు ఇవ్వటానికి నీవే సమర్థుడివి!" అన్నాడు భీష్ముడు.

అర్జునుడు అంపశయ్యపైనున్న భీష్ముడి చుట్టూ ప్రదక్షిణంచేసి, గాండీవం తీసుకుని



ఒక కాంతివంతమైన బాణాన్ని ఎక్కుపెట్టి, పర్జన్యాస్త్రం పఠించి, భీష్ముడి కుడివైపున నేలలోకి కొట్టాడు. బాణం భూమిలోకి దూసుకుపోయి, అది చేసిన రంధ్రంనుంచి జల పైకి వచ్చింది. ఆ నీరు తాగి భీష్ముడు తృప్తిచెందాడు. అర్జునుడు చేసిన ఈ పని యోధులందరికీ అద్భుతంగా కనబడింది.

భీష్ముడు అర్జునుడితో, "నాయనా, ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. క్షత్రధర్మం తెలిసినవారందరికీ నీ శక్తి ఎలాటిదో తెలుసు. నిన్ను గురించి నేనూ, విదురుడూ ఎంత చెప్పినా వివేకంలేక దుర్యోధనుడు విన్నాడు కాదు," అన్నాడు.

ఈ మాటలు విని దుర్యోధనుడు మరింత కుంగిపోయాడు. భీష్ముడు అతనితో, "నాయనా, అర్జునుడికి తెలియని అస్త్రం లేదు. అతనికి కృష్ణుడు తోడున్నంత కాలమూ నీకు అతనితో యుద్ధంకంటె సంధి మేలు. నాతో ఈ యుద్ధం ముగిసేలాగు చూడు. పాండవులతో సంధి చేసుకుని వారికి అర్ధరాజ్యమియ్యి. ధర్మరాజు ఇంద్రప్రస్థాన్ని ఏలుకోనీ. ఇప్పటికైనా నా మాటలు వినకపోతే అపకీర్తిపాలై, చెడిపోతావు," అన్నాడు. అయితే దుర్యోధనుడి తలకు ఈ మాటలు ఎక్కనేలేదు.

భీష్ముడు పడిపోయాడన్న వార్త వినగానే కర్ణుడికి కొద్దిగా భయంవేసింది. అతను త్వరగా భీష్ముడు పడిఉన్న చోటికి వెళ్ళి, కంట నీరు కారుస్తూ నమస్కారంచేసి, "మహానుభావా, నీకు అగ్రహం తెప్పించిన కర్ణుణ్ణి. మిమ్మల్ని చూడవచ్చాను," అన్నాడు. భీష్ముడు మెల్లిగా కళ్ళు తెరిచి కర్ణుణ్ణి చూసి, ఆదరపూర్వకంగా, "నాయనా, కర్ణా! నీవు నాకు శత్రుడవుకావు. అకారణంగా పాండవులను దూషిస్తావుగనక నీ గర్వం తగ్గించటానికి నిన్నుగురించి నిష్ఠురంగా మాట్లాడాను. నీవుకూడా కుంతి కొడుకువేనని నాతో వ్యాసుడూ, నారదుడూ



అన్నారు. యుద్ధంలో నీ పరాక్రమం నే నెరగనా? నీ శౌర్యమూ, దాతృత్వమూ, బ్రాహ్మణభక్తి నేను బాగా ఎరుగుదును. నీవంటి వీరుడు లేడు. దేవతలతో సమానమైనవాడవు. నీ తమ్ములైన పాండవులతో సంధి చేసుకున్నావంటే నేను చాలా సంతోషిస్తాను. మీ వైరాలన్నీ నాతోనే పోనివ్వండి. చావగా మిగిలిన క్షత్రియులైనా సుఖంగా ఉండండి," అన్నాడు.

దానికి కర్ణుడు, "మహానుభావా, నాకు అన్నీ తెలుసు. కాని నేను దుర్యోధనుడి ఉప్పు తిని అతనికి నిరాశ కలిగించలేను. పాండవులు ఎలాగైతే అన్నిటికీ కృష్ణుణ్ణి నమ్ముకుని ఉన్నారో, దుర్యోధనుడుకూడా అన్నిటికీ నన్నే నమ్ముకుని ఉన్నాడు. ప్రజాక్షయం తప్పదని అనేక దుశ్శకునాలు సూచిస్తున్నాయి. అర్జునుడితో నేను యుద్ధం చెయ్యక తప్పదు. మహాత్మా, యుద్ధం చెయ్యటానికి నీ అనుమతి ఇయ్యి. నా యీ నిర్ణయంలో అజ్ఞానం ఏమైనా ఉంటే క్షమించు," అన్నాడు.

"అవును, నాయనా! యుద్ధం తప్పదని నాకూ అనిపిస్తూనే ఉన్నది. అహంకారం వదిలి, స్వర్గం కోరి యుద్ధం చెయ్యి. అర్జునుడితో పోరి వీరస్వర్గం సంపాదించు. శాంతి కోసం నేను చేయవలసినదంతా చేశాను. కాని నా యత్నం ఏమీ ఫలించలేదు," అన్నాడు భీష్ముడు.

ఆయన అన్నట్టుగానే రెండు పక్షాలూ తిరిగి యుద్ధానికి సమకట్టాయి. అయితే భీష్ముడు పడిపోయాక కౌరవసైన్యం అనాథలాగా తయారయింది. కౌరవ యోధులందరూ దిక్కుతోచనట్టుగా తమను నడిపించగల నాయకుడి కోసం ఎదురుచూశారు. చాలామంది కర్ణుడి పేరు ఉచ్చరించారు. వారికి భీష్ముడి తరవాత అంతవాడు కర్ణుడే ననిపించింది. కర్ణుణ్ణి వెంటనే పిలిపించమన్నారు.



కర్ణుడుకూడా ఇప్పుడు యుద్ధరంగం ప్రవేశించటానికి సిద్ధంగానే ఉన్నాడు. భీష్ముడు రణరంగంలో ఉన్నంతకాలమూ తాను అస్త్రధారణ చెయ్యనని అతను ప్రతిజ్ఞ చేసిఉన్నాడు; అలాటి భీష్ముడు పతనమయాడు. అతను తన రథసారథితో, "భీష్ముడు పడిపోయాక కౌరవసైన్యం చాలా దుస్థితికి వచ్చింది. అందుచేత నా కవచమూ, శిరస్త్రాణమూ, విల్లులూ, బాణాలూ, ఇతర శస్త్రాలూ సిద్ధంచెయ్యి," అన్నాడు.

వడిగల గుర్రాలు పూన్చిన దివ్యమైన రథమెక్కి, ధ్వజం ఎత్తించి, కర్ణుడు మొట్టమొదటిసారిగా కురుక్షేత్ర యుద్ధానికి బయలుదేరి వచ్చాడు. అతను భీష్ముడున్న చోట దిగి, ఆయన పరాక్రమాన్ని పొగడి, ఆశీర్వదించమని కోరాడు. భీష్ముడుకూడా కర్ణుడి శౌర్య పరాక్రమాలను కొనియాడి, అతన్ని ఆశీర్వదించాడు.

తరవాత కర్ణుడు భీష్ముడి పాదాలు తాకి, తన సమస్త బలాలతోనూ కౌరవసైన్యాన్ని సమీపించాడు. కర్ణుణ్ణి చూడగానే కౌరవ యోధులు ఉత్సాహంతో పొంగిపోతూ సింహనాదాలు చేశారు.

దుర్యోధనుడుకూడా కర్ణుణ్ణి చూసి ఆనందపడుతూ, "నీ రాకవల్ల అనాథగా ఉన్న సైన్యం తిరిగి సనాథ అయింది. ఇక కర్తవ్యమేమిటో చెప్పు," అన్నాడు.

సేనానాయకుడొకడు మళ్ళీ ఏర్పడవలసి ఉన్నది గనక దుర్యోధనుడు ఆ విషయమై కర్ణుడి సలహా కోరాడు.

"రాజా, మన సైన్యంలోని యోధులందరూ అన్నివిధాలా ఉత్తములే, కాని అందరినీ సేనానాయకులను చేయలేము గదా. ఇతరులకు ఈర్ష్య కలగకుండా ఒకరిని ఎన్నుకోవాలంటే అందుకు అర్హత గలవాడు ద్రోణాచార్యుడొక్కడే ఉన్నాడు. ఆయన బ్రహ్మవేత్త, మహత్తరమైన యోధుడు, మీదుమిక్కిలి నీకు విద్యనేర్పిన



గురువు. ఆయనను సర్వసేనానిగా చేసినట్టయితే, పూర్వం దేవగణాలను నడిపించిన కుమారస్వామిలాగా, మన సైన్యాలను నడిపించి, మన యోధులలో విజయోత్సాహం రేకెత్తించగలడని నా నమ్మకం," అన్నాడు కర్ణుడు. దుర్యోధనుడు ఈ సలహా పాటించి, సేనామధ్యంలో ఉన్న ద్రోణుడి వద్దకు వెళ్లి, "మహాత్మా, జన్మవల్లా, వయసునుబట్టీ, బుద్ధి పరాక్రమాలచేతా నీవే సేనాధిపత్యం వహించదగినవాడవు. మాకందరికీ నాయకుడవుగా ఉండి మమ్మల్ని గెలిచే మార్గంలో నడిపించు," అని కోరాడు.

ఈ మాటలు విని సైన్యంలోని రాజులందరూ సింహనాదాలు చేసి, దుర్యోధనుణ్ణి మెచ్చుకుని, ద్రోణుడికి విజయం కోరారు.

ద్రోణుడు సేనాధిపత్యానికి ఆమోదిస్తూ, "రాజా, నాలో ఏయే గుణాలయితే ఉన్నాయని అన్నావో, వాటినన్నిటినీ వినియోగించి పాండవులతో పోరాడుతూ మీకందరికీ ఆనందం కలిగిస్తాను. సోమకులనందరినీ చంపుతాను. పాండవులు నాతో యుద్ధం చెయ్యలేరు," అన్నాడు.

వెంటనే దుర్యోధనుడు ఆయనను కౌరవ సేనకు నాయకుడుగా అభిషేకించాడు. కౌరవపక్ష యోధులందరూ ఇందులో పాల్గొన్నారు. సైన్యం హర్షధ్వానాలు చేసింది. పుణ్యాహవాచనమూ, స్వస్తివాచనమూ, వందిమాగధ కైవారాలూ మిన్నుముట్టాయి.

ఆసమయంలో ద్రోణుడు సేనామధ్యంలో నిలిచి దుర్యోధనుడితో, "ఓ రాజా, భీష్ముడు నిర్వహించిన సేనాధిపత్యాన్ని ఆయన అనంతరం నాకు కట్టబెట్టి నాకు గొప్ప గౌరవం చూపావు. కనక నావల్ల ఏదైనా వరం కావాలంటే కోరుకో," అన్నాడు.

ఇది విని దుర్యోధనుడు, "గురువర్యా, నాకు ఒకటే కోరిక ఉన్నది. అదేమిటంటే, మీరు ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెచ్చి నాకు అప్పగించాలి!" అన్నాడు.

ద్రోణుడు ఆశ్చర్యపడి, "అదేమిటి? ధర్మరాజును చంపాలని కోరక, ప్రాణాలతో పట్టి తెమ్మని కోరావు?" అని అడిగాడు.

"ఆచార్యా, ధర్మరాజు చచ్చిపోతే మాత్రం నాకు ఒరిగేదేమిటి? అర్జునుడుండి మమ్మందరినీ యుద్ధరంగంలో చంపవచ్చు గదా! ధర్మరాజును ప్రాణాలతో తెచ్చి నా ఎదట పెట్టినట్టయితే ఆయనతో మళ్ళీ జూద మాడి ఓడించి, మరి పదమూడేళ్ళపాటు పాండవులను వనాలకు పంపి, జనక్షయం లేకుండా హాయిగా రాజ్యమేలుకుంటాను," అన్నాడు దుర్యోధనుడు.

అతని కపటం తెలిసిపోయింది. ద్రోణుడు యుక్తిగా, "అది నిజమే. నేను ధర్మరాజును అలాగే ప్రాణాలతో పట్టి తెస్తాను. కాని ధర్మరాజును ఆ అర్జునుడు రక్షించకుండా ఉండాలి. అతడు రక్షిస్తున్నంతసేపూ ధర్మరాజును పట్టటం ఎవరితరమూ కాదు. అందుచేత, దగ్గిరలో అర్జునుడు లేకుండా రెండు ఘడియలపాటు ధర్మరాజు నా ఎదటపడి యుద్ధం చేసినట్టయితే తప్పక ఆతన్ని పట్టి నీకు అప్పగిస్తాను," అన్నాడు.

ద్రోణుడు ఈ మాటకు కట్టుబడి ఉండగలందులకై దుర్యోధనుడు ఆయన చేసిన ప్రతిజ్ఞను సేన అంతటా చాటింపు వేయించాడు. ఈ చాటింపు పాండవ సేనలకు కూడా వినిపించింది. ధర్మరాజు, అందరూ వింటుండగా, అర్జునుడితో, "ద్రోణుడు చేసిన ప్రతిజ్ఞ విన్నావు గదా! యుద్ధంలో నీవు నా వెంటనే ఉండాలి," అన్నాడు.

"ద్రోణుడు నన్ను జయించటం ఎంత అసంభవమో, నేను నిన్ను విడవటం కూడా అంత అసంభవం. ద్రోణుడికి ప్రతిగా నేను యుద్ధం చెయ్యలేని పక్షంలో ప్రాణత్యాగం చేస్తాను. దుర్యోధనుడు ఈ జన్మలో నిన్ను ప్రాణాలతో పట్టి తెప్పించుకోలేడు. ద్రోణుడు చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకోలేడు, ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు అర్జునుడు.






## 5

[చిత్రసేనుడికీ, అతడి పరివారానికీ ఉగ్రాక్షుడు విందు చేశాడు. ఆ సమయంలో, జ్వాలాద్వీపం నుంచి భయంకర పక్షులపై వచ్చినవాళ్ళను గురించిన వర్తమానం అందింది. ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ అడవిలోకి వెళ్ళారు. అక్కడ జ్వాలాద్వీపవాసులతో జరిగిన పోరాటంలో కొందరు రాక్షసులు చచ్చారు, ఉగ్రాక్షుడు బాగా గాయపడ్డాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన సేవకుల భుజాలు ఆసరాగా పట్టుకుని నిలబడి, గాయాల బాధతో గట్టిగా ఓసారి మూలిగి, "చిత్రసేనా! ఎంత వాడికి ఎంత పతనం తటస్థించింది. అన్ని వైపులా కనుచూపు ఆనినంతవరకూ వున్న, ఈ మహారణ్యానికి నేను ఏకైక ప్రభువును. అంతేకాక, రాక్షస జాతిలో ఎంతో కీర్తి ప్రతిష్ఠలున్న గొప్ప వంశంలో పుట్టినవాణ్ణి. అలాంటి నేను, నా అరణ్యం మధ్యనే పరదేశాలనుంచి వచ్చిన క్షుద్రమానవులవల్ల చావుదెబ్బలు తినవలసివచ్చింది!" అంటూ వాపోయాడు.

చిత్రసేనుడు రాక్షసుణ్ణి ఓదార్చే ధోరణిలో, "ఉగ్రాక్షా, విచారించి లాభంలేదు. నువ్వూ, నేనూ కూడా ఓటమి పొందింది జ్వాలాద్వీపాన్నుంచి వచ్చిన మానవులవల్ల కాదు, వాళ్ళు ఎక్కి వచ్చిన భయంకర పక్షులు మనను దెబ్బతీసినై. వాటిని ప్రస్తుతం మనదగ్గిరున్న ఆయుధాలతో ఎదుర్కోవటం వల్ల ప్రయోజనం లేదు. వాటిని చంపేం




దుకు మరేదైనా యితర మార్గం ఆలోచిం చాలి," అన్నాడు.

"అవును, ఆ మార్గం ఏదో మనం తెలుసుకునే లోపలే, ఆ క్రూరులు మనల్ని హతం చేస్తారు. నీ అపూర్వ భవనం, నా కోటా, ఈ అడవి రాజ్యం—అంతా వాళ్ల హస్తగతం అవుతుంది," అన్నాడు ఉగ్రాకుడు నిరాశగా.

అంత భయంకర రూపుడూ, బలశాలీ అయిన రాక్షసుడు, పిరికిపాలెక్కువ వున్న మామూలు మనిషిలా జావకారిపోవటం చూసి, చిత్రసేనుడికి ఎంతో జాలి కలిగింది.

"జ్వాలాద్వీపవాసులు మన రాజ్యం ఆక్రమించుకోవటానికి ప్రయత్నిస్తున్నారని నీ అనుమానమా, ఉగ్రాకా?" అని అడిగాడు చిత్రసేనుడు.

"కాకపోతే, ఈ దాడులన్నీ ఎందుకోసం?" అన్నాడు ఉగ్రాకుడు.

"అదే నాకూ అంతుబట్టటంలేదు. కేవలం మన పల్లెల్లోనుంచి అక్కడొకణ్ణీ యిక్కడొకణ్ణీ ఎత్తుకుపోయేందుకే వాళ్ళు వస్తున్నారని నేనూ నమ్మను," అన్నాడు చిత్రసేనుడు.

"ఆ క్రూరుల్లో మరొక్కడు ప్రాణాలతో దొరికితే నిజం బయట పెట్టిద్దును. దొరికిన ఒక్కగానొక్క వెధవా, రహస్యం బయట పెట్టకుండానే చచ్చి వూరుకున్నాడు," అంటూ ఉగ్రాకుడు పళ్ళు కొరికాడు.

"ఏదో ఒకనాడు ఆ దుర్మార్గుల్లో కొందరు మనకు దొరక్కపోరు. అలా దొరికిననాడు, వాళ్ళను చిత్రహింసకు గురిచేసి అయినా, అసలు రహస్యం బయట పెట్టించి తీరుతాం. అసలు ఈ జ్వాలాద్వీపం ఎక్కడ? ఈ భయంకర పక్షులు వాళ్ల స్వాధీనంలోకి ఎలా వచ్చినై? వాటిమీద సవారీచేస్తూ, వీళ్ళు మన రాజ్యంలో మనుషుల్ని అపహరించటంలో వున్న రహస్యం ఏమిటి? ఇవన్నీ ముందు మనం తెలుసుకోవాలి. సరే, నేను వెళతాను. గాయాలు మానేవరకూ విశ్రాంతి

తీసుకో. కోట రక్షణలు మరికొంత బలపర చటం మంచిది. నేనూ తగు జాగ్రత్తలో వుంటాను," అంటూ చిత్రసేనుడు తన అనుచరులతో బయలుదేరాడు.

"చిత్రసేనా, నేనింత దీనావస్థలో వున్నానని, మరెవరితోనూ అనకు. నీ పౌరుల దృష్టిలో నేను మనిషికంటేకూడా హీనుణ్ణయిపోతాను," అంటూ ఉగ్రాక్షుడు వెనక నుంచి పెద్దగా కేకపెట్టాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి నవ్వు తెప్పించినై. అంతలో సేనానాయకుడు, "మహారాజా!" అంటూ ముందుకు వచ్చాడు.

"ఏమిటి సేనానీ?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"ఆ ద్వీపవాసుల్ని ఎదుర్కొవటానికి మనకు తోడుగా, ఈ ఉగ్రాక్షుడి అనుచరులు కూడా వుండటం బావుంటుంది. ఏనాడు వాళ్ళు పెద్ద బలగంతో మన నగరంమీద దాడిచేస్తారో!" అన్నాడు సేనాని.

సేనాని మాటలు చిత్రసేనుడికి కోపం తెప్పించినై. అయినా అతడు దాన్ని బయటికి కనబడనీయకుండా, "మన నగర రక్షణకు, ఈ రాక్షసి మూకను తోడు తెచ్చుకుందామనేనా నీవనేది? అదెన్నటికీ కుదరదు. నా భవనాన్నీ, నగరాన్నీ నా శక్తితో




రక్షించుకోలేక, రాక్షసుల్ని కాపుంచుకో వలసిన పరిస్థితి వచ్చిననాడు, నేను రాజ్యత్యాగమే చేస్తాను," అన్నాడు చిత్రసేనుడు.

ఈ జవాబుతో సేనాని కుక్కిన పేనులా అయిపోయాడు.

చిత్రసేనుడూ పరివారమూ అడవిలో మరికొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా వెనకనుంచి కేకలు వినిపించినై. చిత్రసేనుడు ఆశ్చర్యపడుతూ వెనుదిరిగి చూశాడు. వికృతమైన ఆయుధాలు చేబూనిన యిద్దరు రాక్షసులు గుండె లవిశేలా పరుగెత్తి వస్తూ "రాజా, రాజా, అగు!" అంటూ కేకలు పెడుతున్నారు.



చిత్రసేనుడు ఆగాడు. సేనాని, "మహా రాజా! ఆ జ్వాలాద్వీపవాసులు మళ్లీ దాడికి రాలేదుగదా?" అన్నాడు.

చిత్రసేనుడు తూర్పుదిక్కుకేసి చూస్తూ, "సూర్యోదయం కాబోతున్నది. పగటివేళల్లో వాళ్లు యింతవరకూ ఎవరి కంటా పడలేదు," అన్నాడు. ఇంతలో రాక్షసభటు లిద్దరూ రొప్పుతూ అతన్ని సమీపించి, "రాజా, ఉగ్రాక్షనాయకుడు మిమ్మల్ని వున్నపళంగా తీసుకురమ్మన్నాడు. ఆయన కుంభికుప్ప దగ్గిర వున్నాడు," అన్నారు.

"అంత అవసరం అయిన పనేమిటి?" అన్నాడు చిత్రసేనుడు.

"భయంకర పక్షులమీద ఎక్కివచ్చేవా డొకడు దొరికాడు. అందుకని, మా నాయకుడు మిమ్మల్ని పిలుచుకురమ్మన్నాడు," అన్నారు రాక్షసులు.

"ఆమాత్రానికి మీరు గుండెలు బద్దలు కొట్టుకుంటూ పరిగెత్తుకు రావాలా? దొరికిన వాడు ఎక్కడికి పోతాడు!" అంటూ చిత్రసేనుడు రాక్షసులతో బయలుదేరాడు.

"వాడు చెట్టుదిగి రానంటున్నాడు, రాజా! మీరు వస్తేగాని పని సానుకూలం కాదు," అన్నాడొక రాక్షసుడు.

ఈ రాక్షసభటులిద్దరూ ఏదో మద్యం తాగిన తిక్కలో వున్నారని చిత్రసేనుడు భావించాడు. శత్రువు ఒకసారి ఒంటరిగా చిక్కాంతరవాత, చెట్టుదిగిరావటం, దిగిరాక పోవటం వాడిచేతుల్లో వున్నపని కాదు.

అరగంట తరవాత చిత్రసేనుడు తన అనుచరులతో కుంభికుప్ప గ్రామాన్ని సమీపించేసరికి, ఊరిబయట ఒక మహావృక్షం చుట్టూ కొందరు రాక్షసులూ, గ్రామవాసులూ కనిపించారు. వారందరిమధ్యా ఉగ్రాక్షుడు నిలబడివున్నాడు. అందరిదృష్టి చెట్టుమీదనే లగ్నమయివుంది. ఆ చెట్టు చిటారుకొమ్మల్లో పులిచర్మం ధరించివున్న ఒకడు కత్తి ఝళిపిస్తూ గావుకేకలు పెడుతున్నాడు.

"నేను రాను, దిగిరాను. కోరి మీ రాక్షసులకి ఫలహారం నేనెందుకవుతాను? ఎవడైనా చెట్టెక్కివచ్చాడో, వాణ్ణి కత్తితో పొడిచి, నేను పొడుచుకు చస్తాను!" అంటున్నాడు వాడు.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుణ్ణి సమీపించి, "ఏమిటీ గత్తరంతా?" అని అడిగాడు.

ఉగ్రాక్షుడు ఆ ప్రశ్న వింటూనే అదిరిపడి, "చిత్రసేనా, వచ్చావా, వచ్చావా! అడుగో ఆ చెట్టుమీద వున్నవాడు, జ్వాలాద్వీపంనుంచి వచ్చిన దుర్మార్గుడు. రాత్రి యిక్కడ జరిగిన పోరాటంలో వెనకబడిపోయి మనకు దొరికాడు. ప్రాణాలతో వాణ్ణి పట్టుకోవటం సాధ్యంఅయేలా లేదు. వీణ్ణించి మనం చాలా రహస్యాలు తెలుసుకోవచ్చు. మేము కాల్చుకుతింటామని వాడు భయపడుతున్నాడు. నువ్వు అభయహస్తం యిచ్చి, వాణ్ణి ఏదోవిధంగా చెట్టునుంచి దింపాలి," అన్నాడు.

చిత్రసేనుడు దృష్టిని చెట్టు చిటారు కొమ్మలకేసి సారించి, "ఓరీ, నీ ప్రాణానికి వచ్చిన భయం ఏమీలేదు. నువ్వు చెట్టు దిగి రా!" అని కేకపెట్టాడు.

"ఇంతమంది దిగమంటే దిగలేదు, నీఎక్కువేమిటి? నువ్వేమైనా మహా





మిటి? వాళ్లు నన్ను చెయ్యికి చెయ్యీ, కాలుకా్కలూ విరుచుకుతింటే?" అన్నాడు.

"వాళ్లనుంచి నీకెలాంటి ప్రమాదమూ వుండదు. వాళ్లూ నా అజ్ఞకు లోబడివుండే వాళ్ళే," అంటూ చిత్రసేనుడు, ఉగ్రాకుడి కేసి తల తిప్పాడు. ఉగ్రాకుడు తన సేవకుల కేసి గుడ్లురిమాడు. ఆ వెంటనే, "చిత్రసేన మహానాయకుడికీ, జై!" అంటూ రాక్షసు లంతా తలలు వంచారు. ఉగ్రాకుడుకూడా చిత్రసేనుడికి తల వంచి ప్రణామంచేస్తూ మెల్లిగా, "ఈ మహారాక్షసుడికి ఎలాంటి ఖర్మ పట్టింది!" అంటూ కోరలు కరకర మనిపించాడు.

"మహారాజా! మీరు అభయమిచ్చారు గనక చెట్టు దిగుతున్నాను," అంటూ పులి చర్మంవాడు చరచర చెట్టు దిగి వచ్చాడు.

"నీకేం భయంలేదు, ఆ కత్తి నాసేనాని పరం చెయ్యి," అన్నాడు చిత్రసేనుడు. పులి చర్మం ధరించినవాడు మారుమాటాడ కుండా తన కత్తిని సేనానాయకుడికి అందించాడు.

"చిత్రసేనా, గానుగలో వేసి ఆడించవల సిన అవసరం కలక్కుండానే, వీణ్ణించి నువ్వు రహస్యాలు బయట పెట్టించగల వనుకుంటాను," అన్నాడు ఉగ్రాకుడు.

రాజువా?" అంటూ పులిచర్మం ధరించిన వాడు విసురుగా మాట్లాడాడు.

"అవును, నేను మహారాజునే. ఈ అడవీ, యిందులో వున్న పల్లెలూ పట్టణాలూ నా పరిపాలనలోనే వున్నవి. నీకు ప్రాణ భయం వుండదని అభయం యిస్తున్నాను," అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడు యిలా అనగానే అక్కడ గుమిగూడిన ప్రజల్లోనుంచి, "మహారాజుకూ, జై!" అన్నకేకలు మిన్నుముట్టినై.

ఆ జయజయధ్వానాలు వింటూనే చెట్టు మీద వున్నవాడు ఆశ్చర్యంగా చిత్రసేనుడికేసి చూసి, "అయితే, యీ రాక్షసుల మాటే

"ఓం, నాకు తెలిసిన రహస్యాలన్నీ చెప్పేస్తాను. అందరం స్నేహితులం అంటూ తీసుకువచ్చి, ప్రమాదం వచ్చేట్టు కనబడ గానే నన్ను వదిలి ఆ దుర్మార్గులు పక్షుల మీద సవారై పారిపోయారు. వాళ్ళు యీసరికి అక్కడెక్కడో తూర్పు సముద్రంలో వున్న జ్వాలాద్వీపాన్ని చేరి వుంటారని నా అనుమానం," అన్నాడు పులిచర్మంవాడు.

"నువ్వు ఆ ద్వీపంవాడివికావా?" అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"ఆ ద్వీపంవాణ్ణయితే, మీకు ప్రాణాలతో దొరికేవాణ్ణా? నేను ఆ ద్వీపవాసులకు సహాయంచేస్తున్న కపిలపురం రాజు నాగవర్మ సైన్యంలోవాణ్ణి. నా పేరు అమరపాలుడు," అన్నాడు వాడు.

నాగవర్మ పేరు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడి, "సేనానాయకుడుగావున్న ఈ నాగవర్మ కపిలపురానికి రాజెప్పుడయ్యాడు? రాజు వీరసింహుడు ఏమయినట్టు?" అని అడిగాడు.

"వీరసింహమహారాజు బహుశా జ్వాలాద్వీపంలో బందీగా వుండివుంటాడు. ఆయన రాజ్యాన్ని అపహరించటమే గాక, ఆయన ఏకైక పుత్రిక కాంతిమతినికూడా బలవంతాన వివాహమాడాలని ఈ నాగవర్మ ప్రయ



త్నిస్తున్నాడు. అంతే కాక, దుండగులైన జ్వాలాద్వీపవాసుల సహాయంతో, తను ఈ చుట్టుపక్కల వున్న రాజ్యాలను జయించి చక్రవర్తి కావాలనికూడా అతను ఆశపడు తున్నాడు," అన్నాడు అమరపాలుడు.

చిత్రసేనుడికి తన రాజ్యపు ఎల్లల్లో వున్న రాజులను గురించిన ఛోగట్టా ఏమీ తెలి యదు. అమరపాలుడు చెపుతున్నదాన్ని బట్టి, ఈ సరికే తన సరిహద్దుల్లో వున్న ఒకానొక దుర్మార్గుడితో జ్వాలాద్వీపవాసులు స్నేహం కట్టారు. ఇంతకూ అమరపాలుడు చెప్పేదంతా నిజమా? లేక యిందులో ఏమైనా మోసం వున్నదా?

చిత్రసేనుడు యిలా ఆలోచిస్తున్నంతలో దూరంగా గుర్రాలు పరిగెత్తి వస్తున్న చప్పు డయింది. చూస్తూండగానే అతడి మంత్రీ నలుగురు సైనికులూ అక్కడికి వచ్చి గుర్రాలు దిగారు. మంత్రి సరాసరి చిత్ర సేనుడి దగ్గిరకు వస్తూ, "మహారాజా! ధవళగిరినుంచి మీ తండ్రిగారు వర్తమానం పంపారు. నాగవర్మ అనే ఒక రాజద్రోహి సైన్యంతో ధవళగిరిమీదికి దాడి వెడలాడట. మీనుంచి వెంటనే కొంత సైనిక సహాయం కావాలన్నారు," అన్నాడు.

చిత్రసేనుడు, తన సేనానికేసి తిరిగి, "సేనానీ, నువ్వు మన సైనికుల్లో సగం మందిని వెంటబెట్టుకుని ధవళగిరికి బయలు దేరి వెళ్ళు. ఇక్కడ రక్షణభారం నేను చూసుకుంటాను," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ సేనాని అక్కడనుంచి కదిలాడు.

"ఈ నాగవర్మ సైన్యాలవెంట భయం కర పక్షులెక్కిన జ్వాలాద్వీపవాసు లెవరైనా వున్నారేమో!" అన్నాడు ఉగ్రాక్షుడు అమర పాలుడితో. అమరపాలుడు ఏదో జవాబు చెప్పబోయినవాడల్లా ఆగి, అందరి కేసీ ఓ మారు అనుమానంగా చూసి, ఆకాశం కేసి తల ఎత్తాడు. —(ఇంకా వుంది)





# నల్లదొంగ

పూర్వం విదర్భదేశపు రాజుకు ముగ్గురు కొడుకులుండేవారు. కొంత కాలానికి ఆయన భార్య చనిపోగా మళ్లీ పెళ్ళిచేసుకున్నాడు. తన రెండవ భార్య తన కొడుకులను సరిగా చూడకపోవచ్చుననే అనుమానంతో ఆయన తన ముగ్గురు కొడుకులకూ ప్రత్యేకంగా ఒక భవనం కట్టించి అందులో వారికి కావలిసిన ఏర్పాట్లన్నీ చేసి, వారిని అందులో ఉంచాడు.

కొంతకాలానికి రాజుగారి రెండవభార్య కూడా ఒక కొడుకును కన్నది. రాజుగారి పెద్దకుమారులు బతికి ఉండగా తన కొడుకుకు రాజ్యం రాదని ఆమెకు పెద్ద బెంగ పట్టుకున్నది.

ఆమె తన విచారాన్ని మంథరలాంటి తన దాసి దగ్గిర బయటపెట్టింది.

"అమ్మా, నీ సవతి కొడుకులను వదిలించుకోవాలంటే ఒకటే ఉపాయం ఉన్నది. వాళ్ళను పాచికల ఆటకు పిలిపించి ఆటలో ఓడించు. నా దగ్గిర మాయ పాచికలున్నాయి, వాటితో ఎవరినైనా ఓడించవచ్చు. ఆటలో ఓడినవాళ్ళు గెలిచినవాళ్ళు కోరినది తెచ్చి ఇవ్వటం పందెంగా పెట్టు. ఓడిపోయినాక వాళ్ళను ఋతుపర్ణుడి చిత్రాశ్వాలను తీసుకురమ్మని చెప్పు. ఋతుపర్ణుడనే రాజు వద్ద మూడు చిత్రాశ్వాలున్నాయి. వాటిని ఋతుపర్ణుడు ఎవరికీ ఇవ్వడు, దొంగతనం చెయ్యటానికి ఎవరైనా యత్నిస్తే వాళ్ళు ప్రాణాలతో బయటపడలేరు," అని దాసి రాణికి సలహా చెప్పింది.

రాణి అలాగే ఒక పండగనాడు విందు చేసి తన సవతి కొడుకులను ముగ్గురినీ ఆహ్వానించింది. వాళ్ళు ముగ్గురూ ఆమెతో జూదం ఆడి ఓడిపోయి, "అమ్మా, మమ్మల్ని ఆటలో ఓడించావు గనక ఏమిటి నీ కోరిక?" అని అడిగారు.

బి. శివరామయ్య



"నాకు మరే కోరికా లేదు, ఋతుపర్ణ మహారాజువద్ద ఉండే మూడు చిత్రాశ్వాలూ పట్టుకురండి," అన్నది రాణి.

ఆ రోజే ముగ్గురూ తమ గుర్రాలపైన ఋతుపర్ణుడి రాజ్యంకేసి బయలుదేరారు. పోగా, పోగా, పోగా ఋతుపర్ణుడి రాజ్యం వచ్చింది. రాజ్యపు పొలిమేరలో నల్లదుస్తులు ధరించిన ఒక వ్యక్తి వారికి కనిపించి, "ఎవరు మీరు? ఎక్కడినుంచి వస్తున్నారు? ఏంపనిమీద పోతున్నారు?" అని రాజకుమారులను అడిగాడు.

"మేము విదర్భరాజు కొడుకులం. ఋతుపర్ణుడి చిత్రాశ్వాలను తీసుకురావటానికి పోతున్నాం!" అన్నారు రాజకుమారులు.

"నేను ఎదురుపడటం మేలయింది. ఋతుపర్ణుడి చిత్రాశ్వాలను తీసుకురావటం మాటలనుకున్నారా? వాటికోసం ఎంతమంది అయితే వచ్చారో అందరూ ప్రాణాలు కోల్పోయారు. నేను ఈ ప్రాంతాల పేరు మోసిన నల్లదొంగను. రాజుగారి చిత్రాశ్వాలను దొంగిలించటానికి నాకు చాతనయిన సహాయం చేస్తాను. నా వెంట రండి," అన్నాడు నల్లదొంగ.

అప్పటికే చీకటి పడుతున్నది. అర్ధరాత్రి వేళకు నల్లదొంగ రాజకుమారులను రహస్య మార్గాలగుండా రాజుగారి కోటలోకి తీసుకుపోయాడు. అదృష్టవశాత్తూ కావలావాళ్లంతా నిద్రలో ఉన్నారు. నల్లదొంగ రాజకుమారులను చిత్రాశ్వాలుండే అశ్వశాలవద్దకు తీసుకుపోయాడు. రాజకుమారులు గుర్రాల కట్టుతాళ్లు విప్పేసరికి ఆ గుర్రాలు కాస్తా గట్టిగా సకిలించాయి. అది విని కావలావాళ్లు నాలుగు మూలలనుంచీ వచ్చి నల్లదొంగనూ, రాజకుమారులనూ పట్టుకున్నారు.

తన చిత్రాశ్వాలను దొంగిలించటానికి వచ్చినవాళ్లను ముంచటానికి గంగాళంలో చమురు పోయించి కాయించాడు రాజు.



ఆయన గంగాళం సమీపంగా కూచుని నేరస్థులను తీసుకురమ్మన్నాడు. భటులు నల్లదొంగనూ, రాజకుమారులనూ పట్టుకొచ్చారు.

రాజు నల్లదొంగ వేసుకున్న దుస్తులు చూసి, "నల్లదొంగకు నకలుగా బయలుదేరినట్టున్నావే?" అన్నాడు.

"నకలు కాదు, మహారాజా, నేనే నల్లదొంగను," అన్నాడు నల్లదొంగ.

"మంచిదయింది. నేను దొంగలకు విధించే శిక్ష చూద్దువుగాని! ఈ ముగ్గురూ ఎవరు?" అన్నాడు ఋతుపర్ణ మహారాజు.

"వీళ్ళు విదర్భరాజకుమారులు," అన్నాడు నల్లదొంగ.

"నూనె కళాపెళా కాగనారంభించగానే వీరిలో చిన్నవాణ్ణి గంగాళంలో వేస్తాం. వాడిప్పుడు చావుకు ఎంత దగ్గిరగా ఉన్నాడంటావు?" అన్నాడు రాజు.

"ఒకప్పుడు నేను చావుకు ఇంతకన్న దగ్గిరిగా ఉండటం జరిగింది, మహారాజా. అయినా ప్రాణాలతో బయటపడ్డాను!" అన్నాడు నల్లదొంగ.

"అదేమిటో చెప్పు. ఇప్పుడీ కుర్రవాడికన్న నువు చావుకు దగ్గిరగా వెళ్ళిన మాట నిజమైతే వీణ్ణి ప్రాణాలతో వదిలేస్తాను," అన్నాడు రాజు.

"అలాఅయితే నా కథ వినండి, మహారాజా!" అంటూ నల్లదొంగ తన కథ ఇలా చెప్పసాగాడు:

* * *

నా చిన్నతనంలో నేనుకూడా జమీందారులాగే బతికాను. అయితే ముగ్గురు పిశాచినులు నన్ను సర్వనాశనం చేసిన కారణం చేత నేను దొంగతనం వృత్తిగా పెట్టుకోవలిసివచ్చింది.

ఈ పిశాచినులు శాపానికి గురి అయిన రాజకుమార్తెలు. వీళ్ళు పగలల్లా అద్భుత సౌందర్యవతులుగా ఉండి, చీకటి పడగానే భయంకరమైన ముసలిరూపాలు పొంది

పిశాచినులై తిరిగేవాళ్ళు. వాళ్ళు ప్రతి రాత్రీ నా సొత్తు కాజేసి తీసుకుపోతూండేవాళ్ళు.

ఒక రాత్రి నేను వీళ్ళకోసం కాపలా కాచి వాళ్ల వెన్నంటి బయలుదేరాను. వాళ్లు ఒక కొండ బిలంలోకి ప్రవేశించారు. వారి వెంట నేనూ ప్రవేశించాను. ఆ బిలం ఏటవాలుగా అడుగుకు దిగిపోయింది. దాని అడుగున ఆ పిశాచినులు కాపరం ఉంటున్నారు. ఒక పొయ్యిమీద కుండలో వారి ఆహారం ఉడుకుతున్నది. పిశాచినులు ముగ్గురూ దాని చుట్టూ కూచున్నారు.

నేను అటూ ఇటూ చూసి ఒక పెద్ద కొండరాతిని వారిమీదికి దొర్లించాను. అది వారి కుండమీద పడి కుండ కాస్తా పగిలిపోయింది. పిశాచినులు తల ఎత్తి నన్ను చూసి అతి వేగంగా పైకి ఎక్కి వచ్చారు. నేను అతి వేగంగా బిలంలోనుంచి బయటపడి పరిగెత్తసాగాను. కాని పిశాచినులు నన్ను అంతకంతకూ సమీపిస్తూండటం తెలిసివచ్చి, నేను ప్రాణాలు కాపాడుకునేటందుకు ఒక పెద్ద చెట్టెక్కాను.

వెంటనే పెద్ద పిశాచిని రెండవదాన్ని గొడ్డలిగానూ, మూడవదాన్ని వేటకుక్కగానూ మార్చేసి, గొడ్డలితో చెట్టుమొదలుపైన ఒక్క పెట్టు పెట్టింది. ఆ దెబ్బకు చెట్టు మొదలులో మూడోవంతు తెగింది. ఆమె



గొడ్డలి ఎత్తి ఇంకొక దెబ్బ వేసింది; చెట్టు మొదలు రెండువంతులు తెగింది. ఇంకొక దెబ్బతో చెట్టు విరిగిపోతుంది.

పిశాచిని మూడవదెబ్బ కొట్టటానికి గొడ్డలి ఎత్తేటంతలో తొలికోడి కూసేసింది. వెంటనే ఆ పిశాచినీ, ఆమె చేతిలో గొడ్డలీ, వేట కుక్కా కూడా రాజకుమార్తెలుగా మారి పోయి తమదారిన తాము నడుచుకుంటూ వెళ్ళిపోయారు....

నల్లదొంగ ఈ కథ చెప్పి, "మహారాజా, ఆ సమయంలో నేను మృత్యువుకు ఈ కుర్ర వాడికన్న దగ్గిరిగా ఉన్నానుకానా?" అని అడిగాడు.

"నిజమే. అతణ్ణి ప్రాణాలతో వదిలేశాను. ఈ రెండోవాణ్ణి వేశేద్దాం; తైలం తెర్లనారంభించింది. వీడు చావుకు ఎంత దగ్గిరిగా ఉన్నాడంటావు?" అన్నాడు రాజు.

"మహారాజా, ఇంతకంటెకూడా నాకు చావు దగ్గిరిగా వచ్చి దాటిపోయింది," అన్నాడు నల్లదొంగ.

"ఆ కథ చెప్పు. నీ మాట నిజమైతే రెండోవాణ్ణి ప్రాణాలతో వదిలేస్తాను," అన్నాడు రాజు.

"అయితే వినండి!" అంటూ నల్లదొంగ ఇలా చెప్పసాగాడు.

* * *





నేను వాళ్ల కుండ పగలగొట్టానన్న కసితో ఆ పిశాచినులు నా సర్వస్వమూ నాశనం చేసి నన్ను దొంగ వృత్తిలోకి దింపేశారు.

ఒకనాడు నేనొక గేదెనూ, ఆవునూ దొంగతనం చేసి చీకటిలో వాటిని ఇంటికి తోలుకుంటూ వస్తూ, కాళ్లు పీక్కుపోతూ ఉంటే ఒక చెట్లతోపులో కూచున్నాను. చలి జాస్తిగా ఉన్నది. గేదెను ఒక చెట్టుకూ, ఆవును మరొక చెట్టుకూ కట్టేసి, చెకుముకి రాయి సహాయంతో చితుకుల మంట చేసి శాలువా కప్పుకుని చలి కాచుకుంటూండగా అక్కడికి పదమూడు పులులు వచ్చాయి. వాటిలో పన్నెండు మామూలు పులులు, పదమూడవది చాలా పెద్దది. ఆకలిమీద ఉన్న ఆ పులుల డొక్కలు బాగా అంటుకుపోయి ఉన్నాయి.

నేను చూస్తూండగానే పెద్దపులి గేదెపైన పడి చంపి తాను సగం తిని మిగిలిన సగమూ మిగతా పన్నెండు పులులనూ తిననిచ్చింది. కదిలితే మీద పడతాయని నేను భయంతో వణికిపోతూ అలాగే కూచున్నాను.

గేదెను తిన్నప్పటికీ పులుల ఆకలి తీరినట్టు లేదు; అవి వెళ్లిపోలేదు. పెద్దపులి ఆవు మీద పడి దానినికూడా చంపేసింది. అదివరకులాగే పులులన్నీ ఆవును పంచుకుని తినసాగాయి. ఈసారి నావంతు వస్తుందని తెలిసి, నేను నామీది శాలువా ఒక చెట్టు మొండెంమీద కప్పి, నా తలగుడ్డ తీసి దానిపైన పెట్టి, పులులు తిండిలో నిమగ్నమై ఉన్న సమయంలో చెట్టు ఎక్కేశాను.

ఆవు ఎముకలు తప్ప ఏమీ మిగల్చకుండా తినేసి పులులు నాకోసం తోపంతా వెతకనారంభించాయి. ఇంతలో పెద్దపులి తల ఎత్తి చెట్టుమీద ఉన్న నన్ను చూసి, మిగిలినవాటిని పిలిచింది. పులులన్నీ చేరి తమ గోళ్ళతో గోరి చెట్టు మొదలు తొలచనారంభించాయి. త్వరలోనే చెట్టుకాస్తా విరిగి పడిపోయింది. కాని నేనీ లోపుగా

పక్క నేవున్న ఇంకొక చెట్టుకొమ్మ మీదికి వెళ్ళిపోయాను.

తరవాత పులులు ఆ చెట్టు మొదలు కూడా గోరి దాన్నికూడా పడగొట్టాయి. నేను మూడో చెట్టుమీదికి వెళ్ళాను. ఇలా అవి చెట్లన్నిటినీ పడగొట్టగా నేను ఆఖరు చెట్టు మీద ఉండిపోయాను. పులులు దాని మొదలు కూడా గోరటం ప్రారంభించి దాదాపు పడేదాకా తెచ్చాయి. నేను ప్రాణాల ఆశ వదిలేసుకున్నాను.

ఇంతలో ఎక్కడినుంచో పన్నెండు సింహాలూ, ఒక పెద్ద జూలు సింహమూ వచ్చి పులులపైన కలియబడ్డాయి. పులులకూ సింహాలకూ భయంకరమైన యుద్ధం సాగింది. పెద్ద పులీ, జూలుసింహమూ తప్ప తక్కిన పులులూ, సింహాలూ యుద్ధంలో చచ్చిపోయాయి. జూలుసింహం గాయపడింది గాని పెద్ద పులి చచ్చిపోయింది. ఈ సమయంలో పెద్ద గాలి వీచి నేనున్న చెట్టు కాస్తా విరిగి జూలుసింహంపైన పడింది. ఆ దెబ్బతో అదికూడా చచ్చిపోయింది...

నల్లదొంగ ఈ కథ చెప్పి, "మహారాజా, ఆనాడు నన్ను చావు ఈ రెండో రాజకుమారుడికన్న ఎక్కువగా సమీపించిందని ఒప్పుకుంటారా?" అన్నాడు.



"నిజమే, వాణ్ణి ప్రాణాలతో వదిలేసి పెద్దవాణ్ణి ఇందులో వేస్తాను. నూనె కళాపెళా కాగుతున్నది. వీడు చావుకు ఎంత దగ్గిరిగా ఉన్నాడంటావు?" అన్నాడు రాజు.

"మహారాజా, నేను ఒకప్పుడు ఈ అబ్బాయికన్నకూడా చావుకు దగ్గిరిగా వచ్చాను," అన్నాడు నల్లదొంగ.

"ఆ కథ చెప్పు. ఆ మాట నిజమైతే వీణ్ణికూడా ప్రాణాలతో వదులుతాను," అన్నాడు రాజు.

"అయితే వినండి," అంటూ నల్లదొంగ ఇలా చెప్పసాగాడు.

* * *



దొంగగా నాకు గొప్ప ఖ్యాతి వచ్చినాక ఎందరో వచ్చి నాదగ్గిర శిష్యులుగా చేరి చోరవిద్య నేర్చుకున్నారు. వారిలో ఒకడు చాలా సమర్థుడు, త్వరలోనే నన్ను మించిన శిష్యుడయాడు.

ఆ ప్రాంతాల ఒక రాక్షసుడు ఉండే వాడు. వాడు ఎందరో రాజులను కొల్లగొట్టి అంతులేని ధనం కూడబెట్టాడు. నేనూ, నా శిష్యుడూ కలిసి వాడి గుహ దోచటానికి ఒకనాడు బయలుదేరాం.

రాక్షసుడి గుహలోకి వెళ్ళాలంటే ఒకే ఒక మార్గం ఉన్నది: కొండపైకెక్కి ఒక నిటారైన బిలంగుండా లోపలికి దిగాలి. తాడుగాని, నిచ్చెనగాని లేకుండా ఇది సాధ్యం కాదు. రాక్షసుడు ఇంట లేని సమయంగా చూసి నేనూ, నా శిష్యుడూ కొండ ఎక్కాం. నేను నా శిష్యుణ్ణి తాడు సహాయంతో గుహలోకి దిగి చేదగలిగినంత బంగారం పైకి పంపమన్నాను.

నా శిష్యుడు, "అమ్మో, నాకు భయం. మీరే దిగండి," అన్నాడు. నేను సరేనని తాడు సహాయంతో రాక్షసుడి గుహలోకి దిగాను. అక్కడ అంతులేని బంగారం ఉన్నది. నేను ఒక సంచిలో నా శిష్యుడు లాగ గలిగినంత బంగారం పెట్టి తాడుకు కట్టాను. నా శిష్యుడు దానిని పైకి చేదుకున్నాడు.

"తాడు కిందికి వదులు. నేను పైకి వచ్చేస్తాను," అని కేకపెట్టాను.

"ఈ క్షణంతో నా శిష్యత్వం పూర్తి అయింది. ఆ మిగిలిన బంగారమంతా తీసుకుని మీరు నింపాదిగా రండి!" అని కేకపెట్టి నా శిష్యుడు, నన్ను రాక్షసుడి గుహలో వదిలి వెళ్లిపోయాడు.

నాకేమి చెయ్యటానికీ పాలుపోలేదు. రాక్షసుడు కొన్ని శవాలను ఒకమూల పోగు వేసి ఉంచాడు. ఏమైతే అది అవుతుందనుకుని నేనుకూడా ఆ శవాలలో ఒకటిలాగా పడుకుని, కదలక మెదలక ఉండిపోయాను. చీకటి పడేవేళ రాక్షసుడు వచ్చి మరికొన్ని శవాలను తెచ్చి పోగుమీద వేసి వంట వండుకోవటానికి మంట చేశాడు. తరవాత వాడు వెదురు కర్రలతో అల్లిన పెద్ద గంప తెచ్చి మూడు నాలుగు శవాలను తీసి గంపలో పడేసి తీసుకుపోయి గంపను గంగాళంమీద బోర్లించాడు.

రాక్షసుడు గంపలో వేసుకున్న శవాలలో నేనూ ఉన్నాను. అయితే నేను గంప వాసాలను గట్టిగా పట్టుకోవటంవల్ల దాన్ని రాక్షసుడు బోర్లించినప్పుడు నేను గంగాళంలో పడిపోలేదు. రాక్షసుడు గంపను అలాగే నేలపైన బోర్లావేసి, వంట అయినాక భోజనం చేసి పడుకుని నిద్రపోయాడు.





వాడి గురక వినిపించగానే నేను గంప కిందినుంచి బయటికి వచ్చి, రాక్షసుడు గుహలోకి దిగటానికి వేసిన నిచ్చెన మీదుగా పైకెక్కి ఇంటికి చేరుకున్నాను...

నల్లదొంగ ఈ కథ చెప్పి, "మహారాజా, నాకు చావు ఎంతలో తప్పిపోయిందో చూశారా? ఈ కుర్రవాడికి చావు అంత సమీపంగా ఉన్నదంటారా?" అన్నాడు.

"లేదు. ఆ కుర్రవాణ్ణి ప్రాణాలతో వదిలేస్తాను. కాని నిన్ను ఈ క్షణంలో గంగాళంలో వేయవచ్చు. చావు నీకు ఇంత సన్నిహితంగా ఎన్నడూ రాలేదని ఒప్పుకుంటావా?" అన్నాడు రాజు.

"వచ్చింది, మహారాజా! ఇంతకన్న చాలా సన్నిహితంగా వచ్చింది. కాని ప్రాణాలతో బయటపడ్డాను," అన్నాడు నల్లదొంగ.

"చెప్పు, చెప్పు! ఎప్పుడు? ఏం జరిగింది?" అన్నాడు రాజు ఆత్రంగా.

"చెబుతాను, వినండి," అంటూ నల్లదొంగ ఇలా చెప్పాడు:

* * *

ఒకనాడు నేను ప్రయాణం చేస్తూ ఆకలిదప్పులతో బాధపడుతూ ఒక ఇంట తొంగిచూశాను. అక్కడ నాకొక ఆడమనిషి కనిపించింది. ఆమె ఒళ్ళో ఒక చిన్న పాప ఉన్నాడు. ఆమె చేతిలో ఒక కత్తి ఉన్నది. ఆమె కళ్ళవెంట కన్నీరు కార్చుతూ ఆ పాపను కత్తితో పొడవబోయి, పాప కేరింతాలు కొట్టి నవ్వటం చూసి మళ్ళీ కత్తి వెనక్కి లాగి మరింతగా ఏడుస్తున్నది.

ఆమె ప్రవర్తన నాకు వింతగా కనిపించి, "ఏమమ్మా, ఎవరు నువ్వు? ఈ పాపను చూసి ఒకవంక ఏడుస్తూ, మరొకవంక కత్తితో పొడవబోతావెందుకు?" అని అడిగాను.

"అయ్యా, నేనొక అభాగ్యురాలిని. కొంతకాలంక్రితం నేను మా అమ్మా, నాన్నా వెంట సంతకు పోతే ముగ్గురు రాక్షసులు వచ్చి

నన్ను ఎత్తుకుతెచ్చి ఇక్కడ పెట్టారు. ఇవాళే నన్ను పెద్ద రాక్షసుడు పెళ్ళాడబోతున్నాడు. నిన్న ఆ దుర్మార్గులు ఎక్కడినుంచో ఈ పాపను తెచ్చి ఈ పూట వండిపెట్టమన్నారు. నేనేం చేసేది? రాక్షసులు వచ్చేలోగా ఈ పాపను చంపి వండకపోతే నా ప్రాణాలు దక్కవు!" అన్నదామె.

"ఆ పాపను చంపకు. నా దగ్గర ఒక పందిపిల్ల ఉన్నది. దాన్ని వండిపెట్టు. వాళ్లు తేడా తెలుసుకోలేరు. వాళ్ళకు అనుమానం కలగకుండా ఉండటానికి ఈ పాప ఎడమ చిటికెనవేలి చిన్న కణుపు కోసి ఒక పక్కగా పడెయ్యి!" అని ఆమెకు సలహా ఇచ్చాను. ఆమె అలాగే చేసింది.

రాక్షసులు వచ్చి పందిపిల్లను తిని చాలా బాగున్నదనుకున్నారు. కాని వారి ఆకలి తీరలేదు. పెద్ద రాక్షసుడు మనిషికోసం వెతుక్కుంటూ వంటఇంట్లోకి వచ్చి, నన్నుచూసి భుజాన వేసుకుని బయలుదేరాడు. నేను వాడి గుండెలో కత్తితో పొడిచి చంపేశాను. తరవాత రెండోవాడు వచ్చి అలాగే నన్ను భుజాన వేసుకున్నాడు. వాణ్ణికూడా అలాగే పొడిచి చంపేశాను.

పెద్ద రాక్షసులిద్దరూ ఎంతకూ రాక పోవటం చూసి మూడోవాడు అనుమానించి




పెద్ద గద తీసుకుని వంటఇంటోకి వచ్చాడు. వాడు నన్ను చూస్తూనే బలమంతా పెట్టి గద ఎత్తి నామీద బలంగా కొట్టాడు. నేను పక్కకు తప్పుకునేసరికి గద కాస్తా నేలలోకి మూడడుగుల లోతు ఇరుక్కుపోయింది. వాడు దాన్ని పైకి తీసేలోపల నేను వాణ్ణి కత్తితో డొక్కలో పొడిచి చంపేశాను. రాక్షసులు ముగ్గురూ చావటంతో నా ప్రాణాలే గాక, ఆ ఆడమనిషి ప్రాణాలూ, పాప ప్రాణాలూ కూడా దక్కాయి...

నల్లదొంగ ఈ కథ చెప్పి, "మహారాజా, నేనానాడు చావుకు సమీపంగా వచ్చినంతగా ఈనాడు వచ్చానంటారా?" అన్నాడు.

"లేదు! ఒకవేళ వచ్చినా నిన్ను నేను ఎలాగూ చంపను. ఎందుకంటే ఆనాడు నువు కాపాడిన పాపను నేనే! కావలిస్తే, నా ఎడమచేతి చిటికెనవేలు చూడు!" అంటూ రాజు తన వేలు చూపాడు. దాని చిన్న కణుపు లేదు.

ఋతుపర్ణమహారాజు లేచివచ్చి నల్ల దొంగను కౌగలించుకుని, "నీకు తగిన బహుమానం ఇవ్వాలని మా నాన్నగారు నీకోసం ఎంతో వెతికించారు, కాని లాభం లేకపోయింది. నన్ను కాపాడినవాడివి నీవేనా కాదా అని తెలుసుకోవటానికే ఇంతసేపూ నీ కథలన్నీ విన్నాను," అన్నాడు.

తరవాత ఆయన నల్లదొంగకు అంతు లేని బహుమానాలిచ్చాడు, తన చిత్రాశ్వాలను విదర్భరాజకుమారులకు కానుకలుగా ఇచ్చి పంపేశాడు.

రాజు రెండోభార్య తన సవతి కొడుకులు చిత్రాశ్వాలను తీసుకురావటం చూసి నివ్వెరపోయింది; కాని తన కొడుక్కు రాజ్యం లేకపోయినా పది రాజ్యాల విలవ చేసే చిత్రాశ్వాలు ఉంటాయిగదా అని తృప్తిపడింది.

"అమ్మా, నీవు కోరినప్రకారం ఋతుపర్ణుడి చిత్రాశ్వాలు తెచ్చి పందెం పూర్తి చేసుకున్నాం!" అంటూ ముగ్గురూ ఆ గుర్రాలను వదిలేశారు.

అవి వాయువేగంతో ఋతుపర్ణుడి వద్దకు తిరిగి వెళ్ళిపోయాయి.

"మోసం చేశారు! ఆ చిత్రాశ్వాలు నాకు వప్పగించలేదు!" అని రాణి అరిచింది.

"చిత్రాశ్వాలను తీసుకురావటంవరకే పందెం. వాటిని నీపరం చేస్తామని మేము అననూ లేదు, నీవు అడగనూ లేదు!" అన్నారు రాజకుమారులు.

ఈ మాటలు వింటూనే రాణికి గుండె ఆగిపోయింది. ఆమె అక్కడ కూలిపోయి ప్రాణాలు వదిలింది.





# పంచకల్యాణి

పూర్వం కుశీనరదేశంలో దేవవర్మ అనే ఒక క్షత్రియ కుమారుడుండేవాడు. అతను విలు విద్యలోనూ, కత్తియుద్ధంలోనూ అసమాన కౌశలం గలవాడు. అయితే చాలా పేదవాడు. అతనికి అరణ్యమధ్యంలో ఒక చిన్న కోట ఉండేది. అతనికి గల ఆస్తి యావత్తూ అతని ఆయుధాలూ, ఒక పంచకల్యాణి గుర్రమూనూ. ఆ గుర్రంమీద అతను దేశాటన చేస్తూ, పండగలకూ, పబ్బాలకూ ఏ రాజుగారైనా యుద్ధవిద్యాప్రదర్శనలు ఏర్పాటుచేస్తే వాటిలో పాల్గొని బహుమానాలు పొంది వాటితో కాలక్షేపం చేస్తున్నాడు.

దారిద్ర్యబాధ జాస్తి అయినప్పుడు దేవవర్మ తన ఆయుధాలనైనా అమ్మాడుగాని పంచకల్యాణిని మాత్రం అతను ఎంతధరకు కూడా అమ్మలేదు.

అలాటి పంచకల్యాణి గుర్రం కుశీనర దేశమంతా వెతికినా మరొకటి లేదు. దానిని దేవవర్మ తన ప్రాణంకంటెకూడా ఎక్కువగా చూసుకునేవాడు.

దేవవర్మ కోటకు ఒక ఆమడదూరంలో సుప్రతిష్ఠుడనే రాజు ఒకాయన ఉన్నాడు. ఆయనకు మాలాపతి అనే కుమార్తె ఉన్నది. ఆమె అపురూప సుందరి. అందుచేత ఆమెను పెళ్ళాడటానికి గొప్పగొప్పవాళ్ళు చాలా మంది వచ్చారు. కాని సుప్రతిష్ఠుడు గొప్ప లోభి. ఆయన తన కుమార్తెకు ఎంతో సంపన్నుడైనవాణ్ణి తీసుకురావాలని పంతం పట్టి కూచున్నాడు.

దురదృష్టవశాత్తూ మాలాపతి దరిద్రుడైన దేవవర్మను ప్రేమించింది. దేవవర్మ కూడా ఆమెను ప్రేమించి ఉండటంవల్ల అప్పుడప్పుడూ ఈ ఇద్దరూ రహస్యంగా కలుసుకుని ఒకరి ప్రేమ ఒకరికి తెలియజెప్పుకోవటం జరిగింది. దేవవర్మ దాదాపు ప్రతిరోజూ మాలాపతిని ఒక్కసారి

జె. పూర్ణచంద్రరావు




చూసి ఆనందించటానికీ, అవకాశం ఉంటే ఒక్క క్షణంసేపు మాట్లాడటానికీ తన పంచ కల్యాణిపైన బయలుదేరి అరణ్యమార్గంగా పడి రహదారి చేరుకుని, ఆ దారిన సుప్రతిష్ఠుడి నగరంవేపు పోతూ ఉండేవాడు. తిరిగి అదేదారిన అరణ్యం మధ్యవున్న తన ఇంటికి వచ్చేస్తూండేవాడు.

ఒకసారి దేవవర్మ సాహసించి సుప్రతిష్ఠుడి దర్శనం చేసుకుని, "నేను మీ కుమార్తె అయిన మాలాపతిని ప్రేమిస్తున్నాను. ఆమెను నాకిచ్చి చెయ్యండి," అని అడిగాడు. సుప్రతిష్ఠుడు గట్టిగా నవ్వి, "నీ దగ్గిర పంచకల్యాణి మినహాయిస్తే ఏమున్నది?" అని అడిగాడు. దేవవర్మ తల వంచుకుని ఇంటికి తిరిగి వచ్చేస్తూ, "మాకిద్దరికీ పెళ్ళికావటం అసంభవం. దేవతలంతా ఏకమైనప్పటికీ మమ్మల్ని భార్యాభర్తలుగా చెయ్యలేరు," అనుకున్నాడు.

ఇది జరిగిన కొద్దికాలానికే ధనగుప్తుడనే వాడు సుప్రతిష్ఠుణ్ణి చూడవచ్చి, "నేను పేరు మోసిన కోటీశ్వరుణ్ణి. మీరుకూడా లక్ష్మీ సంపన్నులే గనక మన ఆస్తులు కలగలుపుకున్నామంటే మనని మించిన కుబేరులు కుశీనరదేశంలో ఉండరు. మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్లిచెయ్యండి," అన్నాడు.

ధనగుప్తుడు వయసులో సుప్రతిష్ఠుడికి ఏమీ తీసిపోడు. అయినప్పటికీ డబ్బుమీది వ్యామోహంచేత సుప్రతిష్ఠుడు అయనకు తన కుమార్తెనిచ్చి చెయ్యటానికి సమ్మతించాడు. ఈ పెళ్లి జరిగితే కాకి ముక్కుకు దొండపండు కట్టినట్టుగా ఉంటుందని అందరూ అనుకున్నారు. కాని సుప్రతిష్ఠుడి మనసు మార్చే శక్తి ఎవరికీ లేదు.

మాలాపతి తనకు కాకుండా పోయిన భర్తను, కాబోయే భర్తనూకూడా తలుచుకుని కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది.

మర్నాడే ముహూర్తం ఏర్పాటయింది. పెళ్ళిలో పెళ్లికొడుకు ఊరేగటానికని మంచి

గుర్రం కావలిసి వచ్చింది. "నేను అడగ మన్నానని చెప్పి దేవవర్మను అడిగి అతని పంచకల్యాణిని పట్టుకురండి," అని సుప్ర తిష్ఠుడు తన మనుషులను అరణ్యంలో ఉన్న కోటకు పంపాడు.

వాళ్ళు వచ్చి గుర్రం అడిగినప్పుడే దేవ వర్మకు మాలావతి పెళ్లివార్త తెలిసింది. అతను మారు మాట్లాడకుండా తన గుర్రాన్ని సుప్రతిష్ఠుడి నౌకర్లకు ఇచ్చేసి విచార సాగరంలో మునిగిపోయాడు.

ఆ రాత్రి పండువెన్నెల కాస్తున్నది. ధన గుప్తుడు మాలావతిని తనవెంట వెన్నెల షికారుకు రమ్మని ఆహ్వానించాడు. సుప్ర తిష్ఠుడు తన మంత్రిని రాజకుమార్తెకు అంగరక్షకిగా వెంట వెళ్ళమన్నాడు.

ఈ కొత్త పెళ్లికొడుకు వెంట విహారానికి వెళ్ళటం ఇష్టం లేకపోయినా చేసేది లేక మాలావతి బయలుదేరింది. బయటికి రాగానే ఆమెకు దేవవర్మ పంచకల్యాణి కనబడేసరికి ఆశ్చర్యం కలిగింది. ఆమె దానిని సమీపించి, "ఇది ఎక్కడినుంచి వచ్చింది?" అని మంత్రిని అడిగి సంగతి తెలుసుకున్నది.

ఈ లోపుగా ధనగుప్తుడు ఒక గుర్రాన్నీ, మంత్రి మరొక గుర్రాన్నీ ఎక్కారు. మాలావతి మాట్లాడకుండా పంచకల్యాణిపైన



ఎక్కింది. ముగ్గురూ రహదారిన బయలు దేరారు. వారు కొంతదూరం వెళ్ళాక ధన గుప్తుడు తన ప్రావీణ్యం చూపటానికి గుర్రాన్ని అతి వేగంగా పరిగెత్తించాడు. మాలావతి మనస్సు ఎక్కడో ఉన్నది. మంత్రిగారు రోజల్లా పెళ్ళిపనులతో అలిసి పోయి ఉండటంచేత గుర్రంమీద అటూ యిటూ తూలుతున్నాడు.

పంచకల్యాణి దాని అలవాటు చొప్పున రహదారినుంచి తొలగి అరణ్యమార్గం పట్టి తాపీగా దేవవర్మ కోటను చేరుకున్నది. ఏదో ఆలోచనలో ఉన్న మాలావతి తల ఎత్తి చూసేసరికి ఎదురుగా అపరిచితమైన కోట కనిపించింది.

రహదారి లేదు, గుర్రాలమీద తన వెంట వచ్చినవారు అయిపులేరు.

దేవవర్మ ద్వారరక్షకులు మాలావతిని సమీపించి, "అమ్మా, మీరెవరు? ఈ రాత్రి వేళ ఏం పనిమీద వచ్చారు?" అని అడి గారు. వారు తమ యజమాని గుర్రాన్ని గుర్తించి మరింత ఆశ్చర్యపోయారు.

పంచకల్యాణి నెక్కి ఎవరో కులీను రాలు వచ్చిందని విని దేవవర్మ ఆయో మయంలో పడి చూడవచ్చి, మాలావతిని చూసి నిర్ఘాంతపోయాడు. మాలావతికి మాత్రం తన విచారమంతా పోయినట్టయింది.

"నన్ను ఎక్కడికి చేర్చాలో పంచకల్యాణి నిర్ణయం చేసింది. నేనిక ఇక్కడే ఉండి పోతాను!" అన్నదామె. దేవవర్మ వెంటనే పురోహితుణ్ణి పిలిపించి ఆమెను వివాహ మాడేశాడు.

మాలావతి కోసం ఆ రాత్రల్లా వెతికారు. మర్నాడల్లా వెతికారు. మర్నాడు సాయం కాలం జరిగిన సంగతి సుప్రతిష్ఠుడికి తెలియవచ్చేసరికి మాలావతి పెళ్లి అయి పోయింది. తన అల్లుడు పేదవాడనిపించు కోవటం ఇష్టంలేక ఆయన తన కుమార్తెకు తన ఆస్తిలో సగం ఇచ్చేశాడు.





## 2

పర్షియా చాలా పెద్దదేశం. అందులో ఎనిమిది రాజ్యాలుండేవి—కాస్విన్, కుర్దిస్తాన్, లురిస్తాన్, షులిస్తాన్, ఇస్ఫహాన్, షిరాజ్, షబన్‌కారా, తూన్‌కైన్‌లు.

ఈ దేశాలలో మేలుజాతి గుర్రాలుండేవి. అవి ఇండియాకు ఎగుమతి అయేవి. ఇక్కడి గాడిదలకు కూడా మంచి గిరాకీ ఉండేది, ఎందుకంటే ఇవి ఎక్కువ తిండి కోరకుండానే, గుర్రాలూ కంచరగాడిదలూ మోయలేని బరువులను ఎంతోదూరం చేరవేసేవి. ఒక దేశంనుంచి ఇంకొక దేశానికి ఎడారిమీదుగా వెళ్ళే వర్తకులకు ఇవి చాలా ఉపయోగకరంగా ఉండేవి.

ఈ రాజ్యాలలో నివసించేవారు దుర్మార్గులు, క్రూరులు. వీరివల్ల వర్తక ప్రయాణీకులకు అపాయమూ, నష్టమూ కలగకుండా తాతార్ పరిపాలకులు ఎన్నో కట్టుదిట్టాలు చేశారు. అప్పటికీ వారు దుశ్చర్యలు మానేవారు కారు. అందుచేత వర్తకులు బాణాలూ, ఆయుధాలూ వెంట ఉంచుకోవలిసివచ్చేది.

పర్షియాలోని ప్రముఖ నగరాలలో యాజ్డ్ ఒకటి. ఇది చాలా అందమైన నగరం, పెద్ద వర్తక కేంద్రం కూడానూ. ఇక్కడినుంచి ఏడురోజులు ప్రయాణిస్తే కర్మాన్ అనే రాజ్యం వచ్చేది. ఇది పర్షియా సరిహద్దున ఉన్నది. ఇక్కడి కొండలలో తవ్వితే వైడూర్యపు మణులు విరివిగా దొరికేవి. ఇక్కడ

# మార్కోపోలో సాహస యాత్రలు



ఉక్కుతో యోధులకు కావలిసిన అయుధ సామగ్రి తయారుచేసే నిపుణులుండేవారు.

కర్మాన్‌రాజ్యం గురించి ఒక చిత్రమైన కథ ఉన్నది. ఇక్కడి ప్రజలు శాంతస్వభావులు, పరోపకారపారీణులు, సౌమ్యులు. ఒకసారి కర్మాన్‌రాజు మేధావుల నందరినీ సమావేశపరిచి, "మన పొరుగున ఉండే పర్షియాలో ప్రజలు ధూర్తులూ, దుష్టస్వభావులూ, హంతకులూ అయిఉన్నప్పటికీ మన ప్రజలు సౌమ్యులూ, సజ్జనులూ అయి ఉండటానికి కారణమేమిటి? ఈ సందేహం నన్ను మహా వేధిస్తున్నది," అన్నాడట. ఈ తేడా మట్టిలో ఉన్నదని మేధావులు ఏకగ్రీవంగా చెప్పారట. వెంటనే రాజు తన మనుషులను ఇస్ఫహానుకు పంపి ఏడు ఓడలనిండా మట్టిని అక్కడినుంచి తన రాజ్యానికి తెప్పించాడట. ఆ మట్టిని కొన్ని గదులలో వేయించి, దానిపైన తివాసీలు పరిపించి, ఆ గదులలో తన ప్రజలకు విందు చేయించాడట. విందు ఇంకా పూర్తికాకమునుపే ఆ ప్రజలు వాగ్వాదాలకు దిగి, తన్నుకోవటానికి ఉపక్రమించారట. ఈ విధంగా మేధావులు చెప్పిన మాట రుజువయింది.

కర్మాన్ నగరంనుంచి బయలుదేరి తొమ్మిదిరోజులు ప్రయాణంచేస్తే రుద్బార్ అనే దేశం వస్తుంది. ఇక్కడ కరౌనా అనే జాతికి చెందిన బందిపోటు ముఠాలున్నాయి. కరౌనాలు మిశ్రమజాతివారు, తాతార్ తండ్రులకూ భారతదేశపు తల్లులకూ పుట్టినవారు. నిగుదార్ అనేతాతార్ రాజు పదివేలమంది సైనికులను వెంటబెట్టుకుని ఆర్మీనియానుంచి బదఖ్‌షాన్, పాషాయ్, కాశ్మీర్ దేశాలుదాటి దిలివార్ అనే రాజ్యంమీద వచ్చిపడి, అక్కడ రాజుగా ఉంటున్న ఆసిదీన్ సుల్తాన్ అనేవాణ్ణి తరిమేసి తానే రాజు అయాడు. అతడివెంట ఉన్న తాతార్లు భారతీయ స్త్రీలకు కన్న సంతానమే కరౌనాలు. వీళ్లు మలబారునుంచి మంత్రశక్తులు సంపా




దించారట; పట్టపగలే చీకటి కల్పించి వర్తకులను దోచుకుని, తమకు చిక్కిన మనుషులను చంపి, చిన్నవాళ్లను బానిసలుగా అమ్మేసేవారు.

రుద్బార్ మైదానాలు సుక్షేత్రమైనవి. హొర్ముజ్ రేవు చేరి భారతీయ వర్తకుల రాకకోసం ఎదురుచూసేవారు తమ ఒంటెలనూ, కంచర గాడిదలనూ ఈ మైదానాల పైన మేయటానికి పంపేవారు. అందుచేత కరౌనాలు ఈ ప్రాంతంలో జాస్తిగా సంచరించేవారు. మార్కొపోలో ఎలాగో వీరివాత పడకుండా తప్పించుకోగలిగాడు.

ఇక్కడినుంచి హొర్ముజ్ రేవుకు రెండు రోజుల ప్రయాణం. ఇది గొప్ప వర్తక కేంద్రం. ఇక్కడ వేడి చాలా జాస్తి.

కెర్మాన్ నుంచి ఉత్తరంగా ప్రయాణించే వారికి ప్రయాణం బహు ప్రయాసతో కూడుకున్నది. మూడురోజులపాటు దారిలో దాదాపు మంచినీరే దొరకదు. ఆ తరవాత ఒక అంతర్వాహిని అయిన నది వస్తుంది. ఆ తరవాత మరి నాలుగు రోజులు నిర్జల ప్రాంతంలో ప్రయాణించాక కూబనాన్ అనే నగరం వస్తుంది. ఇక్కడినుంచి తూన్‌కైన్ రాజ్యాలకు ఎడారి మీదుగా ఎనిమిది రోజుల ప్రయాణం. ఈ రాజ్యాలు పర్షియా ఉత్తర సరిహద్దులో ఉన్నాయి. ఇక్కడ ఒక అంతులేని మైదానం ఉన్నది, అందులో "ఏకాంత వృక్షం" ఉన్నది. ఈ చెట్టుకు ఒక దిశగా పదిమైళ్ళ దూరంలోనూ, మిగిలిన దిశలలో నూరుమైళ్ళలోనూ చెట్టు అనేది లేని కారణంచేత దీనికి "ఏకాంత వృక్షం" అని పేరు వచ్చింది.

తరవాత ములహత్ అనే దేశం వస్తుంది. ఇక్కడ ఒకప్పుడు ఒక "కొండదొర" ఉండేవాడట. అతడి పేరు అలాఉద్దీన్. అతడు రెండు కొండలమధ్య గల లోయలో ఒక అద్భుతమైన తోట వేయించి, అందులో దివ్యమైన భవనాలు అనేకం కట్టించాడట.

వాటిలో అప్సరసల్లాటి స్త్రీలను ఉంచి, ఆ ప్రాంతం స్వర్గమనే భ్రమ కలిగేలాగు చేశాడు. మహమ్మదు ప్రవక్త స్వర్గాన్ని వర్ణించినట్టుగానే పాలూ, నీరూ, సారా, తేనే కాలవలుగా ప్రవహింపజేశాడు.

అయన ఎవరిచేతనైనా తనకు గిట్టని వాళ్ళను హత్యా చేయించదలచినప్పుడు ఆ మనుషులను తన కోటలోకి ప్రవేశించనిచ్చి, వారికి మత్తుపదార్థాలు పెట్టి, మైకంలో వుండగా తన తోటలలో స్త్రీల మధ్యకు చేర్చే వాడు. స్పృహ వచ్చాక వారు తాము నిజంగా స్వర్గం చేరామనుకునేవారు.

వారిని హత్యలు చేయటానికి పంపదలిచి నప్పుడు తిరిగి వారికి మత్తుమందు పెట్టి తన కోటలోకి తెప్పించేవాడు. స్పృహ రాగానే వారు తాము స్వర్గానికి దూరమై పోయామని దిగులుపడేవారు.

"మీరు తిరిగి స్వర్గానికి పోదలచి నట్టయితే ఫలాని రాజును చంపండి. మీకు తిరిగి స్వర్గంలో ప్రవేశం ఇప్పిస్తాను," అనే వాడు. ఎవరిని చంపించటానికి ఏయే మనుషులను పంపాలో "కొండదొర" చాలా జాగ్రత్తగా నిర్ణయించేవాడు.

వాళ్ళు పని పూర్తిచేసి తిరిగి తన కోటకు వచ్చాక వారికోసం బ్రహ్మాండమైన విందులు చేసేవాడు.

ఆ అమాయకులు అడివరకే తాము స్వర్గంలో ఉన్నామనుకున్నారు గనక వారు చావును లక్ష్యపెట్టేవారు కారు.

చిన్నఖానులలో ఒకడైన హులగు ఈ "కొండదొర" గురించి విని వాణ్ణి హత మార్చటానికి 1262 లో గొప్ప సేనను పంపాడు, ఆ సేన వచ్చి కొండదొర కోటను మూడేళ్ళు ముట్టడించాక లోపలివారికి తిండిలేక లొంగిపోయారు. తాతార్లు కొండదొరనూ, అతని చేతిలో కీలుబొమ్మలైన హంతకులనూ చంపేసి ఒక పెద్ద పీడ విరగడ చేశారు. —(ఇంకా వుంది)





# ఎడమచెయ్యి

భోజరాజు కాలంలో భద్రమణి అనే ఒక గొప్ప పండితుడుండేవాడు. ఆయన ఒకసారి భోజ దర్శనార్థం వచ్చాడు. రాజు అయనను ఆదరంతో పిలిపించి తన పక్కనే కూచోబెట్టు కున్నాడు. అంతకుముందే కాళిదాసు రాజుకు కుడిపక్కన కూచుని ఉండటంచేత భద్ర మణి రాజుగారి ఎడమచేతి పక్క కూచోవలిసి వచ్చింది.

ఇది చూసి భద్రమణి తాను కాళిదాసుకు తీసికట్టు అయిపోతున్నా ననుకున్నాడు. కాళిదాసుకన్న తానే ఎక్కువ అని నిరూపించుకోవటానికిగాను ఆయన, ఎడమచెయ్యి కుడిచేతికంటె ఎక్కువైనదని అర్థంవచ్చేలాగ ఈ శ్లోకం చదవసాగాడు:

"గృహ్ణాత్యేష రిపోశ్శిరః, ప్రతిజవం కర్షత్య సావాజినం,
ధృత్వా చర్మధనుః ప్రయాతి సతతం సంగ్రామభూమావని,
ద్యూతం చౌర్య మదస్త్రియంచ శపథం జానాతి నాయం కరః—"

[ఎడమచెయ్యి ముందుగా శత్రువు శిరస్సు పట్టుకుంటుంది, ముందుకు దూకే గుర్రాలను వెనక్కు లాగుతుంది, బాణం వేసేముందు విల్లు పట్టుకుంటుంది. జూదం, దొంగతనం, స్త్రీ బలాత్కారం, శపథాలూ మొదలైనవి చెయ్యదు.]

అంతలోనే కాళిదాసు శ్లోకంయొక్క నాలుగోపాదం ఈవిధంగా పూర్తిచేశాడు:

"దానానుద్యతతాం విలోక్య విధినా శౌచాధికారీ కృతః"

[కాని ఆ ఎడమచేతికి దానంచేసే అర్హత లేనందున బ్రహ్మ నీచమైన పనికి నియోగించాడు.]

ఆ మాట విని భద్రమణి సిగ్గుతో తల వంచుకున్నాడు.






37 51

# మారిపోయిన చిత్తరువు



విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ ప్రపంచంలో ఎవరు ఏది కోరేదీ చెప్పలేంకద! వెనుకటికి నాగధ్వజుడికి తన భార్య చక్కదనం మాసిపోవాలని కోరిక కలిగినట్టే నీకు కూడా ఈ శవాన్ని మోయాలని కోరికగా ఉన్నదనుకుంటాను. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ నాగధ్వజుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు ఉజ్జయినీ నగరపు రాజువద్ద నాగధ్వజుడనే కోశాధికారి ఉండేవాడు. ఆయన ఎంతో సజ్జనుడూ, ఉదారుడూ కావటంచేత నగరంలోని అన్నిరకాలవాళ్లూ ఆయనను ఎంతో ఆదరంతో చూసేవారు. అయితే ఆయన భార్యమూలంగా ఆయనకు

## బేతాళ కథలు



కొంచెమైనా మనశ్శాంతీ, సుఖమూ లేకుండా పోయాయి. ఆమె రోగిష్టిది కావటమే గాక, సంకుచితబుద్ధి కలది. ఆమెతో కాపరం చేసిన కొద్దిసంవత్సరాల కాలంలోనూ ఆయనకు అన్ని సుఖాలమీదా, జీవితంమీదా కూడా పూర్తిగా వైరాగ్యం కలిగింది. తరవాత ఆమె పోనేపోయింది.

భార్య పోయాక నాగధ్వజుడు తిరిగి పెళ్ళాడే ప్రయత్నం చెయ్యలేదు. ఆయన మిత్రులందరూ ఎంత ప్రోత్సహించినా ప్రయోజనం లేకుండా పోయింది. ఇంతలో ఆయన రాచకార్యంపైన ఒక సామంతుడి ఊరికి వెళ్ళటం తటస్థించింది. ఆ సామంతుడికి చంద్రసేన అనే చెల్లెలున్నది. అతిథిగా వచ్చిన నాగధ్వజుడికి చంద్రసేన అతిథి మర్యాదలు ఎంత చక్కగా జరిపిందంటే, తన భార్యకూడా తననుగురించి ఏనాడూ అంత ఆదరాభిమానాలు చూపలేదని అతను అనుకున్నాడు. తాను ఆమెను పెళ్ళాడతానని నాగధ్వజుడు సూచన చెయ్యటం తరవాయిగా చంద్రసేన అంగీకరించింది, ఆమె అన్న కూడా సమ్మతించి, త్వరలోనే వారికి పెళ్ళి చేసేశాడు.

చంద్రసేనతో సహా నాగధ్వజుడు ఉజ్జయినికి తిరిగి రావటం చూసి ఆయన మిత్రులందరూ ఆశ్చర్యపోయారు. ఈ కొత్తభార్య రావటంతో అతనిలో కలిగిన విచిత్రమైన మార్పు చూసి వారందరూ సంతోషించారు కూడా. ఏమంటే నాగధ్వజుడిలో ఉన్న వైరాగ్యం యావత్తూ పోవటమే గాక, ఆయనకు లలిత కళలలోనూ, ఇతర విషయాలపైనా ఎన్నడూ లేని ఆసక్తికూడా పుట్టుకొచ్చింది. చిత్రకారులూ, కవులూ, గాయకులూ ఆయన ఇంట నిత్యమూ చేరి గోష్ఠి జరిపేవారు. ఈ మార్పుకంతకూ కారకురాలు చంద్రసేన. అంధకారబంధురమైపోయిన తన భర్త జీవితానికి ఆమె పండు వెన్నెల అయింది.



నాగధ్వజుడి ఆప్తమిత్రులలో శివానందు డనే చిత్రకారుడుండేవాడు. అతడు గొప్ప ఖ్యాతి సంపాదించుకున్న చిత్రకారుడు.

అతను చంద్రసేనను చిత్రించటానికి నాగధ్వజుడి అనుమతి పొంది, ఆమె చిత్తరువు తయారుచేశాడు. ఈ చిత్తరువు అత్యద్భుతంగా తయారయింది. అది చిత్తరువులాగా లేదు, అద్దంలో చంద్రసేన ప్రతిబింబంలాగా ఉన్నది. శివానందుడు అలా జీవంతో తొణికిసలాడే చిత్తరువును ఎన్నడూ తయారు చెయ్యలేదని అందరూ అన్నారు. శివానందుడా చిత్తరువును నాగధ్వజుడికి కానుకగా ఇచ్చాడు.

నాగధ్వజుడు తన భార్య చిత్తరువును చూసి పొందిన ఆనందానికి మేరలేదు. దాన్ని చూసినప్పుడల్లా అతనికి చంద్రసేనను చూసినట్టే ఉండేది.

పదేళ్ళు గడిచాయి. నాగధ్వజుడికి జీవితం స్వర్గంలాగా సాగిపోయింది. రాజ సేవలో ఆయన బాగా రాణించి మంత్రి పదవి నిర్వహించాడు. ఆయన జీవితం మూడు పూవులూ, ఆరు కాయలూగా ఉండటానికి ప్రధాన కారణం ఆయన భార్య చంద్రసేనయేనని అందరూ ఒప్పుకున్నారు.

అంతలో చంద్రసేన మరణించింది. నాగధ్వజుడి నెత్తిన పిడుగు పడ్డట్టయింది. రాజుగారు మొదలుకొని అందరూ ఆయనను పరామర్శించారు. కొందరు మిత్రులాయనను తీర్థయాత్రలు చేసిరమ్మని, సలహా ఇచ్చారు. నాగధ్వజుడు రాజుగారివద్ద సెలవు పుచ్చుకుని మూడేళ్ళపాటు తీర్థయాత్రలలో గడిపి తిరిగి వచ్చాడు.

ఆయన ఇంటికి తిరిగి వస్తూనే తన భార్య చిత్తరువును చూసుకుని దిగ్భ్రమ చెందాడు. అదివరకు తాను ఎప్పుడు ఆ చిత్తరువును చూసుకున్నప్పటికీ తన భార్యను చూసుకున్నట్టే ఉండేది; కాని ఇప్పుడు ఆ చిత్తరువు అలా కనిపించలేదు.

అయన తన మిత్రుడైన శివానందుణ్ణి పిలిపించి, "శివానందా, ఈ చిత్తరువు ఇప్పుడు చంద్రసేనలాగా లేదు. పదమూడేళ్ల క్రితం ఉండిన చంద్రసేనలాగా ఉన్నది. ఈ పదమూడేళ్ళ కాలంలోనూ ఆమెలో కలిగిన మార్పులు ఈ చిత్తరువులో తీసుకు రాగలవా?" అని అడిగాడు.

శివానందుడు దిగ్భ్రమ చెంది, "నేను మీ భార్యలో ఉండిన సౌందర్యాన్ని మాత్రమే చిత్రించాను. సౌందర్యానికి వయసుతో ఏంపని? ఇది చిత్తరువే గాని అసలు మనిషి కాదుగదా!" అన్నాడు.

"అలా కాదు. చంద్రసేన చనిపోయినప్పటికీ ఒక్క క్షణంకూడా నన్ను విడిచి ఉండలేదు. ఆమె నాతోపాటే పెరుగుతున్నది. ఆమెవెంటనే నేను తీర్థాలన్నీ సేవించాను. ముఖ్యంగా తీర్థయాత్రల మూలంగా మా ఇద్దరిలోనూ చాలా మార్పు వచ్చింది. ఇంతకు పూర్వం ఈ చిత్తరువు ఆమెలాగే ఉంటూ వచ్చింది. కాని ఈ మూడేళ్ళ కాలంలో జరిగిన మార్పులు ఇందులో తీసుకురావాలి. నామీద నీకేమైనా ఆదరం ఉన్న పక్షంలో నేనడిగిన మార్పులు చెయ్యి. నాకు భార్యను తిరిగి ఇచ్చినట్టుగా భావిస్తాను," అన్నాడు నాగధ్వజుడు.




చిత్తరువును మార్చటం శివానందుడికి ఏమాత్రమూ ఇష్టం లేకపోయినా, తన మిత్రుడి దీనస్థితి చూసి, ఆయనపై తనకు గల ఆదరాభిమానాలకొద్దీ చిత్తరువులో నాగధ్వజుడు కోరిన మార్పులన్నీ చేశాడు. ఈ మారిన చిత్తరువును చూసి నాగధ్వజుడు ఎంత ఆనందించాడో శివానందుడు అంత విచారించాడు. తన చేతులారా సౌందర్యాన్ని హత్యచేసినట్టు తోచింది అతడికి.

నాగధ్వజుడిలో భార్యావియోగబాధ ఏమీ లేకపోవటం చూసి ఆయనను రాజు రాచకార్యాలపైన దూరప్రాంతాలకు రాయబారిగా పంపాడు. ఈ పనులలో నిమ

గ్నుడై ఆయన అయిదేళ్లపాటు ఇంటిపట్టున ఉండకుండా తిరిగాడు.

తిరిగి ఇంటికి చేరుకోగానే ఆయన తన భార్య చిత్తరువు చూసుకుని మళ్ళీ దిగ్భ్రమ చెందాడు. ఆ చిత్తరువు తన భార్య ఉండవలసినట్టుగా లేదని ఆయనకు అనిపించింది. ఆయన మళ్ళీ శివానందుణ్ణి పిలిపించి, చిత్తరువును మార్చమని కోరాడు. శివానందుడు చిత్తరువుకు మరికొంచెం వయసు కలిపాడు. దానిని చూసి నాగధ్వజుడు తృప్తిచెందాడు. తరవాత కొద్దికాలానికే ఆయన చనిపోవటం తటస్థించింది.

బేతాళుడీకథ చెప్పి, "రాజా, నాగధ్వజుడు తన రెండవ భార్య అయిన చంద్రసేనను నిజంగా ప్రేమించాడా? ప్రేమించినట్టయితే, అపూర్వంగా చిత్రించిన ఆమె చిత్తరువును అలా మార్పిస్తాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నాగధ్వజుడు చంద్రసేనను ప్రేమించాడనటానికి ఎటువంటి సందేహమూ లేదు. అయితే ఆయన తన భార్యలో ఉండిన చక్కదనాన్ని మాత్రమే ప్రేమించలేదు. మనిషియొక్క స్వభావాన్ని అధికంగా ప్రేమించాడు. చక్కదనాన్ని మాత్రమే ప్రేమించినవాడైతే ఆమెలో వయసు తెచ్చిపెట్టే మార్పులు చూసి సంతోషించి ఉండడు. చంద్రసేన చనిపోయినప్పటికీ ఆమె స్వభావం నాగధ్వజుడి మనసులో సజీవంగానే ఉండిపోయింది. చిత్రంలో ఉన్న వ్యక్తికీ తన మనసులో జీవించి ఉన్న వ్యక్తికీ తేడా కనిపించినప్పుడల్లా ఆయన చిత్తరువును మార్పించాడు, అంతేగాని భార్యమీద నిజమైన ప్రేమ లేక కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






సూచౌ నగరానికి నైరుతీ దిశగా పదిమైళ్ళ దూరాన ఒక పెద్ద సరస్సు ఉన్నది. తూర్పు పడమరలుగా దాని నిడివి డెభ్భై మైళ్ళు, ఉత్తర దక్షిణాలుగా నలభై మైళ్ళు. ఆ సరస్సులో అనేక లంకలుండేవి, వాటిలో పెద్దవి తూర్పు తుంగ్‌తింగ్, పడమటి తుంగ్‌తింగ్ అనేవి. ఈ రెండు లంకలూ సరస్సు నడిమయాన ఉండేవి.

పడమటి లంకలో కావోత్సాన్ అనే ధనికుడుండేవాడు. ఆయనకు ఒక కూతురూ, కొడుకూ ఉండేవారు. కూతురి పేరు చియు-ఫాంగ్. కావో తన పిల్లలిద్దరికీ ఒక గురువును ఏర్పాటుచేసి చక్కగా చదువు చెప్పించాడు. చియు-ఫాంగ్ పుస్తకాల చదువు పన్నెండేళ్ళకల్లా పూర్తిచేసి ఆడవారికి అవసరమైన విద్యలన్నీ నేర్చుకున్నది. ఆమెకు పదహారేళ్ళు నిండేసరికి అద్భుత లావణ్యవతిగా తయారయింది.

కావో తనకు కాబోయే అల్లుడు చదువులోనూ, అందంలోనూ తన కూతురికి తీసిపోకుండా ఉండాలని పట్టుబట్టాడు. ధనికుడు గనక, తగిన సంబంధం వస్తే తాను కన్యాశుల్కం తీసుకోక తన కుమార్తెకు బోలెడంత భరణం యిస్తానన్నాడు.

చియు-ఫాంగ్ తెలివితేటలూ, అందమూ గురించి చుట్టుపక్కలవాళ్ళు విని మనువులు కుదిర్చే మధ్యవర్తులను కావో వద్దకు పంపారు. మధ్యవర్తులు వచ్చి పెళ్ళికొడుకులను గురించి తెగ పొగడటమూ, తీరా చూడబోయేసరికి ఆ పెళ్ళికొడుకులు సామాన్యంగానే ఉండటమూ చాలాసార్లు జరిగాక, కావో మధ్యవర్తుల మాటలు పాటించ నిరాకరించాడు. "నాకు మీ వర్ణనలు అవసరంలేదు. పెళ్ళికొడుకును వెంట బెట్టుకు వస్తేనే నేను ఆలోచించేది!" అని ఆయన మధ్యవర్తులతో చెప్పేశాడు.

చీనా జానపద కథ



సూచౌ సమీపంగా ఒక గ్రామంలో చియెన్ చింగ్ అనే ఒక విద్యార్థి ఉండేవాడు. అతను కావ్యాలన్నీ చదివాడు, చాలా అందమైన కుర్రవాడు. వాళ్ళది పండితుల వంశమే గాని పేదవంశం. చిన్నతనంలోనే అతని తలిదండ్రులు పోయారు. అతను యుక్తవయసు వచ్చికూడా పేదరికంవల్ల భార్యను సంపాదించుకో లేకపోయాడు.

చియెన్ చింగ్ జిల్లాపరీక్ష పాసయాడు. అదృష్టవశాత్తూ ఆ యేడే యెన్ చున్ అనే ధనికుడైన దాయాది ఒకడు చియెన్ చింగ్‌ను తన ఇంట ఉంచుకుని, పరీక్షలకు చదువుకునే సదుపాయం కల్పించాడు.

యెన్ చున్, చియెన్ చింగ్ లిద్దరూ ఒక ఈడువారే. యెన్ కొద్దిగా పెద్ద కావటంచేత చియెన్ అతన్ని "అన్నా" అని పిలిచేవాడు. యెన్‌కు కూడా పెళ్ళి కాలేదు. అతనికి డబ్బయితే ఉన్నదిగాని, అతనికి నచ్చిన సౌందర్యవతి దొరకని కారణంచేత అతను పెళ్ళాడలేదు. అతను కురూపి, కాని మంచి మంచి బట్టలు ధరించి తాను మహా చక్కని వాణ్ణని అనుకుంటూ ఉండేవాడు. దీనికి తగ్గట్టుగా అతనికి చదువుకూడా అంటలేదు. దాయాదు లిద్దరికీ ప్రతి విషయంలోనూ హస్తిమశకాంతరం ఉన్నా ఇద్దరూ అన్యోన్యంగా ఉండేవాళ్ళు. తనను పోషించుతున్నాడుగదా అని చియెన్ కృతజ్ఞతగా ఉండేవాడు; తెలివిగలవాడుగదా అని యెన్ తన జ్ఞాతిని ఎప్పుడూ సలహా అడిగేవాడు.

ఇలా ఉండగా యెన్‌కు దూరపు బంధువైన యూ అనేవాడు వ్యాపారం నిమిత్తం పడమటి లంక వెళ్ళివచ్చి యెన్‌తో మాటల సందర్భాన చియు-ఫాంగ్ చక్కదనం గురించి చెప్పాడు. అటువంటి అందగత్తెను ఎలాగైనా పెళ్ళాడాలని యెన్‌కు పుట్టింది. "నువు నా తరఫున పెళ్ళి రాయబారిగా వెళ్ళి ఆ సంబంధం కుదిర్చిపెట్టు. ఆ పని చేశావంటె నువు నాకున్న బాకీ రద్దుచేసి

మరికొంత డబ్బుకూడా ఇస్తాను," అన్నాడు యెన్ యూతో.

"అది అంత సులువుగా కుదిరే వ్యవహారం కాదు. ఈ కావో అనేవాడు మధ్యవర్తులతో విసిగిపోయాడు. పెళ్ళికొడుకును చూసిగాని మాట్లాడడు," అన్నాడు యూ.

"అయితే మనిద్దరం కలిసి పోదాం," అన్నాడు యెన్.

నీవంటి కురూపికి వాళ్ళు చచ్చినా పిల్ల నివ్వరు, అని చెప్పటానికి మొహమాటపడి యూ, "అందువల్ల ఆటే ప్రయోజనం ఉంటుందనుకోను. నీకన్న అందమైన వాళ్ళను వాళ్ళు నిరాకరించారు!" అని లౌక్యంగా చెప్పాడు.

"అలా అయితే నేను కనిపించకపోవటమే మంచిది. నువు వెళ్ళి నా తరఫున మధ్యవర్తిగా మాట్లాడి సంబంధం ఖాయం చెయ్యి. నువు చెప్పవలిసిన విధంగా చెబితే ఆయన నన్ను చూడకుండానే ఒప్పుకోవచ్చు. ప్రయత్నం చెయ్యటంలో తప్పేమిటి?" అన్నాడు యెన్.

యెన్ మాట తీసివెయ్యలేక యూ పడమటి లంకకు బయలుదేరాడు. ఆయన వెంట యెన్ తన మనిషిని కూడా పంపాడు. కావో యెన్‌ను గురించి విన్నాక యూతో,




"మీరు చెప్పిన యువకుడు మీరన్నంత అందగాడూ, పండితుడూ అయితే మా పిల్ల నివ్వటానికి అభ్యంతర మేముంటుంది? కాని అతన్ని చూసిగాని సంబంధం నిశ్చయం చేయలేను, ఒక్కసారి తీసుకు రండి," అన్నాడు.

"అయ్యో, ఆ కుర్రవాడు అస్తమానమూ పుస్తకాలలో మునిగి తేలుతూ ఉంటాడు, ఎక్కడికీ ఒకంతట కదిలి రాడు. అదీగాక అతడికి చాలా అభిమానం. పెళ్ళిచూపులకు బయలుదేరి వచ్చి తీరా చూశాక సంబంధం నిశ్చయం కాకపోతే తల తీసేసినంతగా బాధపడతాడు," అన్నాడు యూ.

కాఫో కొంచెం ఆలోచించి, "సరే ఒకపని చేస్తాం. నేనే మీ వెంట వచ్చి అతన్ని చూస్తాను. అతను మీరు చెప్పినంత అంద గాడూ, విద్యావంతుడూ అయితే మా అమ్మా యిని తప్పక ఇచ్చేస్తాను. ఎప్పుడు బయలు దేరదామంటారు?" అన్నాడు.

యూ గుండెలలో రాయి పడింది. కావో వచ్చి యెన్‌ను చూశాడో, ఒక్కనాటికి పిల్ల నివ్వడు. ఇంత శ్రమా వృథా అయిపోతుంది. అందుచేత ఆయున, "మీ కెందుకులెండి శ్రమ? నేనే వెళ్ళి ఎలాగైనా అతన్ని బయలుదేరదీస్తాను," అంటూ ఇంటికి ప్రయాణమయాడు.

యూ తెచ్చిన వార్త విని యెన్ ఏమీ తోచక కొట్టుకున్నాడు. తన నౌకరును రహ స్యంగా అడిగి యూ తనతో ఏమీ అబద్ధాలు చెప్పలేదని రూఢి చేసుకున్నాడు. అప్పుడతనికి ఒక ఉపాయం తట్టింది. అతను యూను తన ఇంటికి పిలిపించి, "మళ్ళీ ఒకసారి పడమటి లంకకు వెళ్ళిరావాలి," అన్నాడు.

"ఏమీ లాభంలేదు. ఈ సంబంధం ఆశ వదులుకో!" అన్నాడు యూ.

"లేదు, లేదు. ఒక చిన్న యుక్తి చేస్తాం. మా తమ్ముడు చియెన్ ఉన్నాడే వాడు నా కంటె ఒక్కపిసరు అందంగానే ఉంటాడు, కాస్త చదువుకున్నాడు కూడానూ. నా పేరు



చెప్పి వాణ్ణి తీసుకుపోయి పెళ్లి ఖాయపరిస్తివా, ముహూర్తం పెట్టి పెళ్లికూతురును రప్పించి పెళ్లి చేసేసుకుంటాను. ఆ తరవాత మోసం బయటపడినా ఎవరు చేసేదిగాని ఏమీ ఉండదు," అన్నాడు యెన్. "చియెన్ ఒప్పుకుంటాడా?" అన్నాడు యూ.

"ఎందుకు ఒప్పుకోడు? వాడు నాకు కొంత ఋణపడి ఉన్నాడు. ఈ పని తనవల్ల కావాలంటే ఎదురు చెప్పడు!" అన్నాడు యెన్. తరవాత అతను చియెన్‌తో తన ఎత్తుగడ చెప్పాడు.

చియెన్ అంతా విని, "నీకు సహాయపడటానికి నాకేమీ అభ్యంతరం లేదుగాని, మోసం బయటపడ్డాక మన ఇద్దరి పరువూ నిలవదేమో!" అన్నాడు.

"నిన్ను పెళ్లికూతురి తండ్రి ఎరగడు, కనక ఏమీ చెయ్యలేడు. చిక్కేమన్నా వస్తే మధ్యవర్తికి వస్తుంది. నువు నాకు ఈ సహాయం చేసి తీరాలి," అన్నాడు యెన్.

చియెన్‌కు మంచి సిల్కు బట్టలూ అవీ కట్టబెట్టారు. అసలే అందగాడు, మంచి దుస్తులు ధరించి నవ మన్మధుడులాగున్నాడు. మధ్యవర్తి యూ అతన్ని వెంటబెట్టుకుని కావో ఇంటికి వెళ్ళాడు.

పెళ్లికూతురివైపు వాళ్ళంతా చియెన్‌ను చూసి పరమానందభరితులై, "మన అమ్మా





యికి అందంలో ఏమాత్రమూ తీసిపోడు. ఈపాటి సంబంధం వస్తుందని అనుకోలేదు," అనుకున్నారు.

కావో అతని పాండిత్యం పరీక్షించటానికి తన పిల్లలకు చదువు చెప్పిన గురువును పిలిపించి చియెన్‌తో మాట్లాడించాడు. ఆ గురువుకు ఏమంత పెద్ద పాండిత్యం లేదని గ్రహించి చియెన్ ప్రాచీన కావ్యాలలోనుంచి ఉపమానాలూ, సామెతలూ గుక్క తిరగకుండా వప్పగించాడు. అంతా విని గురువు వెళ్ళిపోతూ కావోతో, "అబ్బో, అపారంగా చదివినవాడు! గొప్ప పండితుడు!" అనిచెప్పి వెళ్లిపోయాడు.

కావోకు పెద్ద బరువు దిగిపోయినట్టయింది. ఇంతకాలానికి తనకు నచ్చిన అల్లుడు దొరికాడు, తన కూతురు కూడా చాటుగా పెళ్లికొడుకును చూసి తృప్తిపడింది. అయన యూతో, "మంచి వరుణ్ణి తీసుకువచ్చారు. సాధ్యమైనంత త్వరలో ముహూర్తం పెట్టించి మిగతా తంతు జరిపించండి," అన్నాడు.

పని సానుకూలం చేసుకుని యూ, చియెన్‌తోసహా తిరిగి వచ్చాడు. యెన్ జరిగినదంతా విని సంతోషించాడు. అతను వెంటనే పెళ్లికి ముహూర్తం ఏర్పాటుచేసి పెళ్లికూతురికి ప్రధానపు కానుకలు పంపించాడు.

పెళ్లిముహూర్తంనాటికి పెళ్లికూతుర్ని తల్లి తన వెంటబెట్టుకుని పెళ్లికొడుకు ఇంటికి తీసుకురావటమూ, అక్కడ వివాహవిధి జరగటమూ ఆ ప్రాంతాల అచారంగా ఉండేది. కాని కావో తనఅల్లుణ్ణి తన బంధుజనానికంతకూ చూపి వారి మెప్పు సంపాదించి, మంచి అల్లుణ్ణి సంపాదించాననిపించుకోవాలనే ఉద్దేశంతో, పెళ్ళికొడుకు స్వయంగా వచ్చి పిల్లను తీసుకుపోవాలనీ, పెళ్లికి ముందే తన ఇంట విందు కుడవాలని కబురుచేశాడు.




"ఇక ఈసారి నేను వెళ్ళక తప్పదులాగుంది," అన్నాడు యెన్.

యూ నెత్తి నోరూ బాదుకుని, "కిందటిసారి చియెన్‌ను ఇంటిల్లిపాతీ నోళ్ళు తెరుచుకు చూశారు. ఈసారి నిన్ను చూశారంటే నీ గొంతూ, నా గొంతూకూడా తెగగోసేస్తారు. పైపెచ్చు పెళ్లికాస్తా తప్పిపోతుంది," అన్నాడు.

"నువే ఈ బెడద అంతా తెచ్చిపెట్టావు. నేను వెళ్లినా వాళ్ళు పెళ్లికి ఒప్పుకునేవాళ్లే. ఈ పెళ్లి రాసిపెట్టి ఉంది! వధువు కట్నం కూడా తీసుకున్నాడు, నన్నుచూసి ఇప్పుడు పెళ్లిచెయ్యను పొమ్మంటాడా? పదిమందిని వెంటపెట్టుకునిపోయి ముక్కలు విరగదన్నిస్తాను," అన్నాడు యెన్ ఆవేశంతో.

"వెర్రివాడా, నీ పదిమంది ఏమూల? కావో కేక పెట్టాడంటే లంక అంతా కదిలి వస్తుంది. మనకందరికీ బాగా దేహశుద్ధి చేసి పంపిస్తారు. ఇది ఉపాయంవల్ల ఒనగూడవలిసిందేగాని, అఘాయిత్యంతో జరిగే పని కాదు," అన్నాడు యూ.

యెన్ మరొకసారి చియెన్‌ను ఆశ్రయించవలిసివచ్చింది. "తమ్ముడూ, వచ్చే తదియనాడు నా పెళ్ళి. నేను విదియనాడు పెళ్ళికూతురి ఇంటికి వెళ్ళి ఆ పిల్లను తీసుకురావాలి. నాకు బదులుగా నువు మళ్లీ వెళ్ళిరావలిసి ఉంటుంది," అన్నాడు యెన్.

"కిందటిసారి దారి వేరు, ఈసారి నేను వెళ్ళటం ఎంతమాత్రమూ ఉచితంగా ఉండదు," అన్నాడు చియెన్.

"నిజమేమరి. కాని ఒకసారి నిన్ను చూసి ఉన్నారుగనక వాళ్ళు నిన్నే పెళ్ళికొడుకుగా గుర్తిస్తారు. పెళ్ళికూతురిక్కడికి చేరి పెళ్ళి తంతు పూర్తి అయాక ఏ చిక్కూ ఉండదు," అన్నాడు యెన్.

విధిలేక చియెన్ ఒప్పుకున్నాడు. అతను పెళ్ళికొడుకులాగా ముస్తాబై, పెద్ద బలగాన్ని వెంటబెట్టుకుని, అనేక పడవలు మాట్లాడు

కుని, మధ్యవర్తితోసహా పడమటి లంకకు వెళ్ళాడు. పెళ్ళికూతురి ఇంట ఆ రోజు బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశారు. కొందరు పెళ్ళికొడుకుపైన పద్యాలు చదివారు, అందరూ పెళ్ళికూతురి తండ్రిని అభినందించారు. పెళ్ళివారు పెళ్ళికూతురును వెంటపెట్టుకుని బయలుదేరవలసిన సమయం సమీపించింది. మధ్యవర్తి అయిన యూ పెళ్ళికూతురి తరఫు మనుషులకూ, నౌకర్లకూ కట్నాలు పంచాడు. వధూవరులు బయలుదేర బోతున్నారు.

ఇంతలో పడవలవాళ్ళు వచ్చి, "అయ్యా, బయలుదేరకండి. పెద్ద గాలి సాగింది, తుఫాను వస్తున్నది," అన్నారు. మేళతాళాల మోతలో బయటి గాలి హోరు ఎవరూ వినలేదు, కాని అవి ఆపగానే నిజం తెలిసివచ్చింది.

కావో ప్రయాణమై వెళ్ళిపోబోతున్న బంధువులనూ, అతిథులనూ మళ్ళీ లోపలికి ఆహ్వానించాడు.

మర్నాడు తెల్లవారేసరికి గాలి ఉధృతం మరింత అయింది. మంచుకూడా కురవసాగింది. ఆరోజే ముహూర్తం. ఆ ముహూర్తం దాటితే మరొక ముహూర్తం ఎప్పుడో తెలియదు. ఆ గాలిలో, ఆ మంచు వర్షంలో సరస్సు దాటటం అసంభవం. ఈ ముహూర్తం



దాటిపోతే పెళ్ళికొడుకు ఒంటరిగా తిరిగి పోవలిసివస్తుంది, అది ఏమంత శుభంకాదు.

ఒక వృద్ధుడు కావోతో, "ఎందుకిలా మథనపడుతున్నారు? ఆ పెళ్ళితంతు కాస్తా ఇక్కడే జరిపెయ్యండి. ఏ చిక్కూ ఉండదు!" అన్నాడు. చాలా మంచి ఆలోచన అని అతిథులందరూ హర్షించారు.

చియెన్‌కు ఏమిచెయ్యాలో పాలుపోలేదు. ఇప్పటికే తాను ఈ మోసంలో చాలాదూరం ఇరుక్కున్నాడు. పాపం, అతను తన దాయాదికి సహాయపడదామని ఈ వంచనకు ఒడిగట్టాడేగాని, ఇందువల్ల అతనికి ఒరిగిన దేమీ లేదు. పెళ్ళికొడుకుగా నటించటంతో పాక పెళ్ళికూడా చేసుకోవాలంటే అతనికి కంగారెత్తింది. మధ్యవర్తి యూతో సంప్రతించుదామని అతడికోసం వెతికితే, ఆ మనిషి అంతకుముందే మతిచెడ పూర్తిగా తప్పతాగి ఏమూలనో పడుకుని గురకపెట్టి నిద్రపోతున్నాడు.

చియెన్ పెళ్ళికూతురి తండ్రితో, "తొందరపడకండి. ఇంకొక ముహూర్తం పెట్టుకుందాం!" అన్నాడు.

కావో ఆశ్చర్యపడి, "దేనికీ? ఈ ముహూర్తం మించలేదుగా?" అన్నాడు. చియెన్‌కు ఏమనాలో తెలియలేదు. పెళ్ళితంతూ, విందూ సక్రమంగా జరిగిపోయాయి. వధూ



వరులను గదిలోకి పంపారు. చియెన్ పెళ్ళి కూతురికేసి చూడలేదు, ఆమెను పలకరించ లేదు, ఒకమూల పడుకుని నిద్రపోయాడు.

మూడురోజులు గాలివాన చెలరేగి నిలిచి పోయింది. పెళ్ళికూతురివెంట ఆమె తండ్రి కూడా బయలుదేరాడు. అందరూ పడవలలో పెళ్ళికొడుకు గ్రామం చేరుకున్నారు.

చియెన్ ముందుగా పరిగెత్తి యెన్ దగ్గిరికి వెళ్ళి జరిగినదంతా చెప్పబోయాడు. కాని, చియెన్ తనకు కావలిసిన కన్యను తానే పెళ్ళాడేశాడనేసరికి యెన్‌కు ఆవేశం వచ్చి, చియెన్‌ను చావబాదసాగాడు.

ఇంతలో కావో వచ్చి, "ఎవరు నువు? నా అల్లుణ్ణి ఎందుకలా కొడుతున్నావు?" అని అడిగాడు. యెన్ ఆయనతో నిజం బయట పెట్టాడు. కావోకు ఒళ్ళుతెలియని ఆగ్రహం వచ్చి మధ్యవర్తి యూను పట్టుకుని, "దొంగముండాకొడకా, నన్నింత మోసం చేస్తావా?" అని చావగొట్టసాగాడు.

ఆ తరవాత యెన్ తరఫువాళ్ళూ కావో తరఫువాళ్ళూ కలియబడ్డారు. పెద్ద రగడ సాగింది. ఆ సమయానికి న్యాయాధికారి మేనా కుర్చీ ఎక్కి అటుగా పోతూ ఆగి, "ఏమిటీగలాటా?" అని అడిగాడు. అందరినీ విచారించగా జరిగిన సంగతి యావత్తూ బయటపడింది. ఆయన అందరినీ న్యాయ స్థానానికి తీసుకుపోయి విచారణ జరిపి, యెన్‌కు కొరడాదెబ్బల శిక్ష విధించాడు.

ఆయన చియెన్‌నుకూడా తప్పుపట్టాడు; కాని అతను అదివరకే యెన్ చేత దెబ్బలు తిని ఉండటంవల్ల ఇక వేరే శిక్ష ఇవ్వలేదు.

ఆ తరవాత న్యాయాధికారి కావో కుమార్తెకూ చియెన్‌కూ జరిగిన వివాహం ఖాయం చేస్తూ తీర్పు ఇచ్చాడు.

కావోకు కావలిసిందికూడా అదే. ఆయన తన అల్లుణ్ణి పడమటి లంకకు తీసుకుపోయి తన ఇంటనే ఉంచుకున్నాడు. చియెన్ తన భార్యతో సుఖంగా ఉన్నాడు.








పీపాలకొద్దీ పానీయం, బళ్ళకొద్దీ వండిన మాంసం నాకు దగ్గరగా తీసుకొచ్చారు.

బండెడు మాంసం నాకు పంటికిందికి కూడా రాలేదు. చాలా బళ్ళ మాంసం చప్పరించేశాను.





లొడితెడున్న పీపాల్లోని పానీయం నాలికకూడా తడపలేక పోయింది. తాగగానే మైకం కలిగి, నిద్ర కమ్ముకువచ్చింది.

చేతిమీద గుచ్చుకొన్న బాణాలను నేను మైకంలో వుండగా తీసివేసి తైలం పూశారట. నన్ను కట్టేసిన తాళ్ళన్నీ తెంపివేశారు.



ఇంజనీర్లు వడ్రంగులు అయిదువందలమంది కలసి 84 అంగుళాల పొడుగు, 48 అం॥ల వెడల్పు, వుండి 22 చక్రాలు అమర్చిన బల్లకట్టు రథం నిర్మించారు. గడలు నాటి కొక్కేలకు తాళ్ళుపోసి వాటితో నా శరీరాన్ని ఆ రథం మీదికి దొర్లించారు.





4½ అంగుళాల ఎత్తున బలిష్ఠంగా వున్న 1500 భారీ గుర్రాలను రథానికి పూన్చి, 2640 అడుగుల దూరానున్న నగరానికి బయలుదేరారు.

ఒక మజిలీలో చిన్న తమాషా జరిగింది— ముగ్గురు కొంటివాళ్ళు నా మొహంమీదకెక్కి నా ముక్కులో బల్లెం తిప్పారు.



నాకు హఠాత్తుగా మెలకువ వచ్చి ఒక్క పెట్టున తుమ్మేసరికి ఆ ధాకకు ఆ ముగ్గురూ ఎగిరి దూరంగా పడ్డారు.





ఊరి శివారున వున్న పాడుబడ్డ గుడి దగ్గర రథం ఆగింది. రాజ్యం అంతటికీ పెద్దదైన ఆ భవనం 8 అడుగుల ఎత్తుంది. నేను లేచి నిలబడి బద్ధకంగా ఒళ్ళు విరుచుకునేసరికి తొలిసారి నా పూర్తి విగ్రహాన్ని చూచిన లిల్లిపుట్ ప్రజలు భయంతో కకావికలై పరిగెత్తారు. చుట్టూ కలయచూడగా రాజ్యమంతా చిన్న బొమ్మలకొలువులా కనిపించింది.





నా ఎడంకాలికి సన్నటి గొలుసులు చుట్టి గుడి గుమ్మానికి కట్టేశారు. రెండు గజాలమేర నడయాడడానికి మాత్రమే వీలుంచారు.

నన్ను చూడ్డానికి అప్పుడే కొన్నిలక్షలమంది ప్రజ పోగడ్డారు. ఈలోగా చక్రవర్తిగారే స్వయంగా విచ్చేశారు.



నేను వినయంగా అభివాదం చేశాను. ఆయన సంతోషించారు. నాకు ఎవరేనా హానిచేస్తే కఠినంగా దండిస్తామని ప్రజను హెచ్చరించారు. నా అన్నపానాలకూ నిద్రకూ వసతులు చేయించి వెళ్లిపోయారు. లిల్లిపుట్ భాష నేర్పేందుకు గురువులనుకూడా నియమించారు.





కొన్నాళ్లతరువాత రాజప్రతినిధు లిద్దరువచ్చారు. నా జేబులన్నీ తణిఖీ చెయ్యాలన్నారు.

అందుకు సమ్మతించి వారిని జాగ్రత్తగా నా చేతిలోకి ఎక్కించుకుని ఒకొక్క జేబులో దింపాను. వారి నివేదిక ఇలా వుంది—



"పర్వతకాయుడి కోటు కుడిజేబులో ఒక ముతకగుడ్డ వుంది. దాని వైశాల్యం ఒక ఎకరం వుంటుంది.



"ఎడమవైపు జేబులో ఒక పెద్ద వెండి భోషాణం వుంది. చాలా కష్టంమీద దాని మూత తెరిచి లోనికి చూశాము.



"అందులో మోకాలు లోతున ఎర్రటి పొడుం వుంది. ఘాటైన అ దుమ్ము మా ముక్కుల్లోకి రాగా తుమ్ములతో ఉక్కిరిబిక్కిరయాము.



"పక్కజేబుల్లో రెండు పొడుగాటి యంత్రాలున్నాయి. చెక్క, ఉక్కు కలసివున్న వాటితో అతడేమి చేస్తాడో మాకు తెలీలేదు.



"అతని ఛాతీవద్ద వున్న జేబులోనుండి చెవులు పగిలిపోయేట్లు 'టిక్ టాక్' అన్న ధ్వని వినబడింది. అది బయటికి తీసి చూపాడు.



"ఆ మహాయంత్రంపై రెండు పెద్ద బద్దీలు తిరుగుతున్నాయి. దాన్ని చూడందే అతడు ఏ పనీ చెయ్యడుట."



# గంగావతరణము

పంచమాశ్వాసము :

దండ అతని మీద పడెను
బండమీద పడినట్లుగ.
అపు డూర్వశి దుఃఖముతో
అచటనుండి వెడలిపోయె.

"వత్సా! ఇక లెమ్ము లెమ్ము,
వర మడుగుము. నే బ్రహ్మను,
నీ తపమున కే నెంతయు
ప్రీతుడనయి వచ్చినాడ."

అను పలుకులు వినినంతట
కనులు తెఱచి భగీరథుడు
బ్రహ్మదేవు పాదములకు
భక్తి తోడ మ్రొక్కినాడు.

"ఓ విధాత! భూలోకము
పావనమై శాంతి నొంద
గంగ నిటకు పంపించుము,
కనికరమును చూపించుము."

అని సగరుని మున్మనుమడు
అడిగినంత బ్రహ్మదేవు
డాలోచన చేసి తుదకు
"అట్లె గంగ నిత్తు" ననెను.

బ్రహ్మ తన కమండలమున
పట్టి యుంచుకొనిన గంగ
స్త్రీ రూపము దాల్చి నిలిచి
తీవ్రముగా పలికెనిట్లు:

"ఓ విధాత! ఏమంటివి?
పావనియగు నీ చెల్లిని
పాతాళమునకు త్రోతువ?
పాడు భువికి పంపింతువ?

పాపి జనులు, పతిత జనులు,
పాషండులు కల రచ్చట;
ఇచ్చోటికి పంపింతువ?
రొచ్చులోని కంపింతువ?"

ఉత్పల సత్యనారాయణాచార్య

అని పలికిన బ్రహ్మదేవు
డామె కిట్లు చెప్పినాడు:
"పాపమ్మును కడిగివేయు
పని నీయది, ఓ పావని!

పతితజనుల లేవనెత్తి,
పాపుల పాపమ్ము కడిగి,
భూలోకపు జనుల నెల్ల
పుణ్యాత్ముల గావింపుము.

నీవలననె భువి రెండవ
దేవలోక మైపోవును.
నిన్నెంతటి వారైనను
నెత్తి మీద నిడుకొందురు.

మంగళకర జలతరంగ!
గంగా! ఇటు ప్రవహింపుము;
ఈ ధరణిని శుద్ధి చేసి
నీ ధర్మము నెఱవేర్చుము."

అని విధాత పలికినంత
ఆలోచన చేసె నామె.
భగీరథుడు సాగిలపడి
పాదములకు మ్రొక్కులిడెను.

అంత నామె సమ్మతించి
అతనితోడ నిట్లనియెను:
"నీ కోరిక నెఱవేఱగ
నేను భువికి వత్తుగాని—

ఆకాశమునుండి నేను
అవతరించి పడునప్పుడు
ఈ ధారుణి ఇసుమంతయు
నా ధాటికి ఆగలేదు.

ఏ విధాన దింపుకొనెదొ,
ఎవరిని పిలిపించుకొనెదొ
చెప్పు"మనిన భగీరథుడు
చింతించుచు ఇట్లనియెను:



"ఓదేవా ! గంగానది
నేపజాలు వారెవ్వరో
చెప్పు "మనగ ఆ విధాత
శివు డంచును సెలవిచ్చెను.

మాయమయ్యె బ్రహ్మ, గంగ
మరలవత్తు నంచు పోయె.
అంత నతడు శివుని గూర్చి
అమిత తపము సాగించెను.

కైలాసమునం దుండిన
భోలాశంకరు డప్పుడు
భగీరథుని మంచి కోర్కె
ఫలియింపగ నెంచినాడు.

పార్వతితో నందీశ్వరు
పైని కూరుచుండి శివుడు
వడివడిగా వడివడిగా
వడివడిగా వచ్చినాడు!

భగీరథుడు కనులు తెఱచి
పరమశివుని దర్శించెను;
భక్తి తోడ ప్రతి పెట్టి
పార్వతీశు బూజించెను.

హరహరహర! మహాదేవ!
కరుణింపుము సాంబశివా!
పావన గంగావాహిని
భరియింపుము పరమశివా!



అని యాతడు ప్రార్థింపగ
ఆనందము పొంది శివుడు
"శిరమున నేనా గంగను
ధరియింతును, పిలువు "మనెను.

అంత భగీరథు డెంతో
సంతసమున ఉప్పొంగెను;
చేతు లెత్తి గంగమ్మను
ఓ తల్లీ! దిగి రమ్మనె.

పరమశివుడు భరియించును
ధరణిపైకి దిగి రమ్మనె;
భూతలమును శుద్ధిచేయ
ఓ తల్లీ! దిగి రమ్మనె.

శివు డప్పుడు ఎదురుగ జగ
జెట్టి వోలె నిలుచుండెను,
మెడను జాచి జడల జార్చి
మింటి వంక కనుచుండెను.

గంగానది మింట నుండి
త్రొంగి చూచె పరమశివుని
ఇతడేనటె నిలబడినది!
ఎంత తెగువ ఈ శివునిది!

అని తలంచి గంగానది
ఆకాశము నుండి భువికి
ఉఱుములతో మెఱపులతో
ఉరవడించి తరలివచ్చె.

పెక్కు వేల మేఘమ్ములు
ఒక్కసారి గర్జించెను!
తళతళమని మెఱపు లెన్నొ
కళుకుమంచు దీపించెను!

దేశ మెల్ల చీకటితో
దిక్కు తెలియ రాకుండెను!
హోరు మంచు పెద్ద గాలి
ఒక్కుమ్మడి వీతెంచెను!—(సశేషం)






# అవిమారకుడు

వైరంత్యనగర రాజైన కుంతిభోజుడికి సుదర్శన, సుచేతన అని ఇద్దరు తోబుట్టువు లుండేవారు. వారిలో సుదర్శన కాశీరాజుకు భార్య అయింది; సుచేతన సౌవీర రాజును పెళ్ళాడింది.

సుదర్శన తేజశ్శాలి అయిన కొడుకును గోరి, కుంతీదేవి సూర్యుణ్ణి ఆవాహన చేసిన విధంగా, మంత్రోచ్చాటనతో అగ్నిదేవుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, ఆయనవల్ల ఒక కొడుకును కన్నది. ఇదే సమయంలో సుచేతన ఒక బిడ్డను కంటే ఆ బిడ్డ చనిపోవటం జరిగింది. సుదర్శన, తన భర్తకు తెలిస్తే క్షమించడన్న భయంతో, తాను కన్న బిడ్డను తన చెల్లెలికి ఇచ్చేసింది. తన భార్య ప్రసవించిన బిడ్డ పోయిన సంగతి, ఆ బిడ్డ స్థానంలో మరొక బిడ్డ వచ్చిన సంగతి సౌవీరరాజు ఎరగడు. అయినా, సుచేతనా ఈ బిడ్డను తమ బిడ్డలాగే ఎంతో గారాబంగా పెంచి, వాడికి విష్ణుసేనుడని పేరు పెట్టుకున్నారు. విష్ణుసేనుడు చిన్నతనంనుంచీ తనలోగల దైవాంశను ఏదోవిధంగా చూపుతూనే వచ్చాడు. వాడు చిన్నవాడై ఉండగానే ఒక రాక్షసుడు గొర్రె రూపంలోవచ్చి పిల్లలను పీడిస్తూ ఉండటం చూసి వాడు దానినికాస్తా చంపేశాడు. ఇదిచూసి సౌవీరకులు వాడికి అవిమారకుడని పేరుపెట్టి, అదే పేరుతో పిలవసాగారు. (అవిమారకుడంటే గొర్రెను చంపిన వాడని అర్థం.)

ఒకనాడు సౌవీరరాజు వేటకు వెళ్ళాడు. అక్కడ అరణ్యంలో ఆశ్రమం కల్పించుకుని ఉంటున్న చండభార్గవుడనే ముని రాజును చూసి, "నా శిష్యుణ్ణి పులి పీకింది. ఆశ్రమ వాసులను వన్యమృగాలనుంచి కాపాడే ధర్మం రాజులదిగదా. మీ ధర్మం మీరెందుకు నిర్వర్తించరు?" అంటూ కోపావేశంలో నానామాటలూ అనేశాడు.



రాజుకుకూడా కోపం వచ్చింది. ఆయన మునితో, "నీవు మునిరూపం దాల్చిన చండాలుడిలాగున్నావే! ఎందుకు నన్ను అకారణంగా నిందిస్తున్నావు?" అన్నాడు.

మునికి కోపం రెచ్చిపోయి సౌవీరరాజూ, ఆయన భార్యా, కొడుకూ కూడా చండాలులై పోవాలని శపించాడు. రాజు భయపడి ముని కాళ్ళు పట్టుకున్నాడు. ముని కొంత శాంతించి, తన శాపం ఒక్క ఏడాది గడిచాక విరిగిపోయేటట్టు అనుగ్రహించాడు.

సౌవీరరాజు తన నగరానికి తిరిగిపోయి, తన రాజ్యాన్ని మంత్రుల పరం చేసి తన భార్యా కుమారులతో చండాలరూపంలో అజ్ఞాతవాసం చెయ్యటానికి వైరంత్య నగరం చేరుకున్నాడు. అప్పటికి అవిమారకుడు పద్దెనిమిదేళ్ళవాడు.

కుంతిభోజుడికి కురంగి అనే అసమాన సౌందర్యవతి అయిన కుమార్తె ఉన్నది. ఆమెకు యుక్తవయసు రావటంవల్ల సంబంధాలు విచారిస్తున్నారు. అయితే కురంగికి తగిన భర్తను నిర్ణయించలేక కుంతిభోజుడు మథనపడుతున్నాడు.

ఒకనాడు కురంగి కౌంజాయనుడనే మంత్రివెంట రాజోద్యానానికి వెళ్ళింది. అక్కడ ఆమె తన ఇష్టంవచ్చిన ఆటలన్నీ ఆడి ఇంటికి తిరిగి వస్తుండగా అంజనగిరి అనే మదపుటేనుగు వెర్రెత్తి, మావటివాణ్ణి కిందపడేసి తొక్కి చంపి జనంకేసి పరిగెత్తుకుంటూ వచ్చింది. జనం పరిగెత్తారు. స్త్రీలు ఆర్తనాదాలు చేశారు. ఇంతలో ఏనుగు కురంగి ఎక్కిన వాహనంకేసి వచ్చింది. కురంగి వాహనంలోనుంచి కిందికి దూకేసింది.

ఇంతలో అవిమారకుడు ఆ మదపుటేనుగును సమీపించి, దానిని కొట్టి తనమీదికి దాని దృష్టి మళ్ళేలాగా చేశాడు. ఆ విరామంలో మంత్రి రాజకుమార్తెను వాహనంలోకి ఎక్కించి ఇంటికి పంపేశాడు. ఆయన

అవిమారకుణ్ణి గురించి విచారించగా అతను చండాలుడని తెలిసింది.

ఈ సంఘటన జరిగిన సమయంలో కురంగీ, అవిమారకుడూ ఒకరి నొకరు చూసుకుని ప్రేమించుకున్నారు. ఆ ప్రేమ వారిద్దరినీ కార్చిచ్చులాగా దహించనారంభించింది.

ఈలోపల కుంతిభోజుడు తన కుమార్తెకు తగిన సంబంధం గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. కాని మేనరికం చేసుకుందామని ఆయనకు మనసులో ఉన్నది. అవిమారకుడి అసలుతల్లీ, కాశీరాజు భార్యా అయిన సుదర్శన మరొక కుమారుణ్ణి కన్నది. అతడి పేరు జయవర్మ. అతడికి కురంగినిచ్చి చెయ్యమని కాశీనుంచి కబురువచ్చింది. కురంగిని సుదర్శన కొడుకుకివ్వటం కన్న సుచేతన కొడుకుకివ్వటమే మేలని కుంతిభోజుడు భావించాడు; ఎందుకంటే సుచేతన భర్త అయిన సౌవీరరాజు కుంతిభోజుడి భార్యకు అన్నకూడానూ. కురంగిని తన కొడుక్కు (అంటే అవిమారకుడికి) చేసుకుంటానని సౌవీరరాజు ఒకప్పుడు కబురు చేశాడు; అయితే అప్పటికింకా కురంగికి పెళ్ళియీడు రాలేదని కుంతిభోజుడు సమాధానం చెప్పి పంపాడు.




ఇటీవల మళ్ళీ సౌవీరరాజు వద్దనుంచి వర్తమానం లేకపోవటం చూసి కుంతిభోజుడు మనుషులను పంపగా, సౌవీరరాజు కుటుంబం ఎవరికీ తెలియకుండా ఎటో వెళ్ళిపోయారనీ, రాజభవనం తాళంపెట్టి ఉన్నదనీ తెలిసింది.

కురంగికూడా తన దాది అయిన ధాత్రి అనే ఆమెనూ, నలినిక అనే చెలికత్తెనూ పిలిచి, వారికి తన ప్రేమరహస్యం తెలిపి, తనను ఏనుగునుంచి రక్షించిన యువకుడెవరో విచారించి అతనిని తనవద్దకు రహస్యంగా తీసుకురమ్మని కోరింది. వారు ఆ ప్రకారమే అవిమారకుణ్ణి వెతుక్కుంటూ

వచ్చి, అతనిని రాత్రివేళ కురంగి ఉండే మందిరానికి రమ్మని గుర్తులు చెప్పారు.

అవిమారకుడికి సంతుష్టుడనే బ్రాహ్మణ వయస్యుడొకడున్నాడు. అతను అవిమారకుణ్ణి విడవలేక, తానుకూడా వైరంత్య నగరంలోనే బస పెట్టి, ఎవరి కంటా పడకుండా అవిమారకుడి ఇంటికి వెళ్ళి వస్తూండేవాడు. అవిమారకుడు అతనితో తాను ఆ రాత్రి రహస్యంగా కురంగిని చూడబోతున్నట్టు చెప్పాడు. సంతుష్టుడు అతనికి కొంత సహాయం చేశాడు.

అనాటి అర్ధరాత్రి అవిమారకుడు ఒక తాడూ, కత్తీ తీసుకుని, దొంగవాడి వేషంలో రాజసౌధం ప్రవేశించి, కురంగి చెలికత్తెల సహాయంతో తన ప్రియురాలిని కలుసుకున్నాడు. వారిద్దరికీ గాంధర్వ వివాహం జరిగింది.

కొంతకాలమయాక ఒక రాత్రి అవిమారకుడు రాజసౌధంలో ఉండగా కురంగి గదిలో ఎవరో ఉన్నట్టు రాజుగారికి తెలిసింది. అవిమారకుడు ఎలాగో తప్పించుకు బయట పడ్డాడు. ఆ తరవాత రాజు తన కుమార్తెకు గట్టి కాపలా ఏర్పాటుచేశాడు. కురంగి దుఃఖసముద్రంలో మునిగిపోయింది.

కురంగికి దూరమై బతకటం సాధ్యంగా తోచక అవిమారకుడు ఆత్మహత్య చేసు



కుండామని అగ్నిలో దూకాడు. కాని అగ్ని దేవుడు అతని తండ్రే కావటంచేత అతనికి కొంచెమైనా ప్రమాదం జరగలేదు. కొండ మీదినుంచి దూకి ప్రాణాలు విడుద్దామను కుని అవిమారకుడు ఒక కొండ ఎక్కాడు.

అదృష్టవశాత్తూ అదే సమయానికి ఒక విద్యాధరుడు తన భార్యతోసహా ఆకాశ మార్గాన పోతూ ఆ కొండమీద దిగాడు. వారు అవిమారకుడి ఆత్మహత్యా ప్రయత్నానికి అడ్డుతగిలి, అతని కథ అంతా విన్నారు. విద్యాధరుడు అతనికి ఒక ఉంగరం ఇస్తూ, "ఇది మహిమ గల ఉంగరం. దీనిని కుడి చేతి వేలికి ధరించినవారు అదృశ్యంగా ఉంటారు, ఎడమచేతికి పెట్టుకుంటే మళ్ళీ కనిపిస్తారు. దీని సహాయంతో అదృశ్యుడవై నీ ప్రియురాలి వద్దకు క్షేమంగా వెళ్ళ వచ్చు," అన్నాడు.

"దీని సహాయంతో నేను పట్టపగలే కురంగిని చేరగలను," అనుకున్నాడు అవిమారకుడు. అతను ఆ ఉంగరాన్ని తన కుడిచేతి వేలికి పెట్టుకుని అదృశ్యుడై కురంగి ఉండే చోటికి వెళ్ళేసరికి ఆమెకూడా తన కంఠానికి వస్త్రంతో ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో ఉన్నది. అవిమారకుడు అకస్మాత్తుగా తన ఎదట ప్రత్యక్షమయేసరికి ఆమె ఆనందానికి మేరలేదు.



కాశీరాజు కుమారుడైన జయవర్మ కురంగిని పెళ్ళాడదామని వైరంత్య నగరానికి వచ్చాడు. కాని కురంగి తల్లి తన మేనల్లుడైన విష్ణుసేనుడు (అవిమారకుడు) ఏమైనదీ తెలిసినదాకా తన కుమార్తెను జయవర్మకిచ్చి చెయ్యటానికి ఇష్టపడలేదు.

ఈ స్థితిలో శాపవిముక్తుడై సౌవీర రాజు కుంతిభోజుడివద్దకు వచ్చాడు. ఆయన విచారంగా ఉండటం చూసి కుంతిభోజుడు కారణమడిగాడు. తన కొడుకు కొంత కాలంగా కనిపించటంలేదని సౌవీర రాజు ఆయనతో చెప్పాడు.

ఇంతలో అక్కడికి నారదమహర్షి వచ్చాడు. కుంతిభోజుడు నారదమహామునికి స్వాగతం చెప్పి, "మహాత్మా, సౌవీర రాజ కుమారుడు సజీవుడై ఉన్నాడా? కనిపించక పోవటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

"అతను ప్రస్తుతం తన వివాహోత్సాహంలో ఉన్నాడు," అన్నాడు నారదుడు.

"అతడికి పెళ్ళి అయిపోయిందా? ఎక్కడ? ఎవరి పిల్లను చేసుకున్నాడు?" అని కుంతిభోజుడు అడిగాడు.

"వైరంత్యనగరంలో కుంతిభోజుడి కుమార్తెను చేసుకున్నాడు," అన్నాడు నారదుడు.

అసలుసంగతి బయటపడగానే కుంతిభోజుడు అవిమారకుడికీ, కురంగికీ శాస్త్రోక్తంగా వివాహంచేయ నిశ్చయించాడు. కాని తన చెల్లెలయిన సుదర్శనకు ఏమి చెప్పాలో ఆయనకు తోచలేదు.

నారదుడు సుదర్శనను చాటుగా పిలిచి, "అవిమారకుడు నీకు పుట్టినవాడేననీ, జయవర్మకు కురంగి ఈడుకాదు గనక ఆమెచెల్లెలు సుమిత్రను చేసుకుంటాననీ నీ భర్తతో చెప్పెయ్యి," అన్నాడు.

తరవాత కురంగికీ అవిమారకుడికీ యథావిధి వివాహం జరిగింది. వారి కష్టాలు తీరిపోయాయి.



# ఎల్లోరా గుహలు

జగద్విఖ్యాతి సంపాదించుకున్న మన దేశపు అద్భుతాలలో ఎల్లోరా గుహలు అద్భుతమైనవి.

ఈ గుహలు బొంబాయిరాష్ట్రంలోని ఔరంగాబాద్‌కు వాయువ్య దిశగా 13 మైళ్ళ దూరంలో ఉన్నాయి. ఏకాండపు రాతిని మలిచి మనుషులే ఈ గుహలు తొలిచి అతి సుందరమైన శిల్పాలు నిర్మించారు. ఈ గుహలలో 12 బౌద్ధులు తొలిచినవి. వీటి నిర్మాణం 350-750 మధ్య జరిగిందని భావిస్తున్నారు. 17 గుహలు హిందువులు తొలిచారు. వీటిలోని శిల్పాలు శివపార్వతులకు సంబంధించినవి. ఈ గుహలలో మలిచిన కైలాసాలయం అత్యద్భుతమైనది. దీని నిర్మాణం 735-755 మధ్య జరిగి ఉండవచ్చు. దీని నిడివి 276 అడుగులు, వెడల్పు 154 అడుగులు, ఎత్తు 108 అడుగులు. ఈ ఆలయం యావత్తూ ఒక రాతినుంచి మలచబడింది. (ఈ ఆలయంయొక్క స్తంభం; పక్కనే చూపబడింది.)

ఇవికాక మరి 5 గుహలను జైనులు 8-13 శతాబ్దుల మధ్యకాలంలో తొలిచారు. 15 వ శతాబ్దంలో ఇక్కడికి వచ్చిన అరబ్బీ యాత్రికుడొకాయన ఆ కాలంలో ఇది గొప్ప యాత్రాస్థలంగా ఉండినట్టు చెప్పాడట.



# చిత్రమైన ఉపదేశం ★

రచన : బైరాగి

అనగనగా ఒక ఊళ్ళో
కనకదత్తు డనువాడు—
గొప్ప భాగ్యవంతు డతడు
దూరదృష్టి గలవాడు.
అతనికి ధనదత్తు డనే
కొడుకొక్కడు ఉన్నాడు.
ఒకడే కొడుకవటంలో
కడు ముద్దుగ పెరిగాడు.
చదువు సంధ్య లబ్బలేదు
బడితెలాగ పెరిగాడు.
దుస్సహవాసాలు పట్టి
బాగా చెడిపోయాడు.
ధనదత్తుడు యౌవనమద
మత్తుడు మితిమీరాడు.
కష్టార్జితమైన డబ్బు
నీళ్ళలాగ వాడాడు.
ఇది తెలిసిన తండ్రి దిగులు
తో మంచం పట్టాడు.
చనిపోతూ తన కొడుకును
పిలిచి ఇలా అన్నాడు—
"అబ్బాయీ! డబ్బు విలువ
తెలియక వాడేవాడు
చివరకు నిర్భాగ్యుడయ్యి
బిచ్చమెత్తుకుంటాడు.
నీకే ఆ స్థితి వస్తే
బ్రతుక వద్దురా నీవు—
ఇంటి నడిమి దూలానికి
ఉచ్చుపోసుకొని చావు."
అని ఉపదేశించి తండ్రి
ఉసురు బాసి పోయాడు.
పట్టపగ్గములే లేక
కొడుకు పెచ్చు రేగాడు.
ఉన్నదంత కాజేసీ
అప్పుల పాలయ్యాడు.
చిల్లిగవ్వ పుట్టక తన
తండ్రి గురుతు కొచ్చాడు.
వాడా దూలానికి ఉరి
వేసి చావబోయాడు.
దూలం విరిగింది, చావు
రాక నేల గూలాడు.
ఆ దూలంలోంచి కనక
రత్నరాశి కురిసింది.
తండ్రి దాచిపెట్టిన నిధి
కనులముందు మెరిసింది.
తండ్రి చావమనటంలో
గుట్టు తెలిసికొన్నాడు.
అప్పులన్ని తీర్చి వాడు
బుద్ధిగలిగి బ్రతికాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జాతికి రత్నం గాంధీ సత్యం

రెండవ ఫోటో : మేకపాలనే త్రాగెను నిత్యం

పంపినవారు : ఆర్. ఎ. వి. రమణమూర్తి c/o ఆర్. బాపన్న,

స్టెనో-టైపిస్ట్, కలెక్టర్స్ ఆఫీసు, విశాఖపట్నం.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# ప్రశ్నోత్తరాలు

1. *ఎం. శ్రీనివాసరావు, తాడేపల్లిగూడెం*

**"గలివర్ యాత్రలు" ప్రచురించుచున్నందులకు అభివందనములు. "మార్కొ పోలో సాహస యాత్రలు," "గలివర్ యాత్రలు" రచయిత లెవరో తెలుపవలసినదిగ కోరుచున్నాము.**

"మార్కోపోలో సాహస యాత్రలు" మా ఆఫీసులోనే తయారవుతున్నాయి. "గలివర్ యాత్రలు" రచయిత, చిత్రకారుడు "బాపు".

2. *ఎస్. రామారావు, ఎస్. గోపాల్, వెంకటాపురం*

**సహోదరా, "గలివర్ యాత్రలు" నిజమా, కల్పితమా?**

కేవలం కల్పితం.

3. *తిరునగరి సత్యనారాయణ, జమ్‌షేడ్పూర్*

**'చందమామ', "జ్వాలాద్వీపం" కల్పితమా లేక యథార్థమా?**

యథార్థంలాగున్నదా?

4. *టి. కృష్ణారావు, మామిడికోళ్ళ*

**మామయ్యా, బుద్ధుడు అహింసావాదిగదా! చుందుడు పెట్టిన పందిమాంసమును ఎట్లు భుజించెను?**

బౌద్ధులకు మాంసభోజనం నిషిద్ధం కాదు.

5. *ఐ. సామ్రాజ్యలక్ష్మి, పల్విపట్టు*

**"గోల్ గుంబజ్"ని గురించి కన్నులకు కట్టినట్టుగా వ్రాశారు. బీజాపూర్‌లో ఇంకా అనేకమైన ప్రఖ్యాత శిథిలాలున్నాయన్నారు. వాటినిగురించి కూడా తెలియజేస్తారని ఎదురుచూస్తున్నాము.**

బీజాపూర్‌లో కోటా, 'సాత్‌మంజిల్', ఆదిల్‌షా సమాధీ, మసీదూ, శిథిలమైపోయిన "గగన్ మహల్" మొదలైనవి ఉన్నాయి. అయితే ఇవి మన దేశపు అద్భుతాలకిందికి రావు.

6\. *ఆర్. మునివెంకటరెడ్డి, రామాపురం*

**ప్రపంచాద్భుతాలు ఏడున్నాయంటారు. అవి ఏవి?**

రోడ్స్ వద్ద "కలోసస్" అనే విగ్రహం; ఎఫెసస్ వద్ద "డయానా" ఆలయం; అలెగ్జాండ్రియా వద్ద ఉండిన దీపస్తంభం; ఈజిప్టులో పిరమిడ్‌లు; ఒలింపియా వద్ద "జూపిటర్" విగ్రహం; బాబిలోన్ అకాశ వనాలు; "మౌసోలస్" సమాధి. వీటిలో ఈనాడు మనం చూడగలిగినవి పిరమిడ్‌లు మాత్రమే. ఈ సప్తాద్భుతాలను 1959 నవంబరు సంచికలో బొమ్మలతో సహా ప్రచురించాం.

7\. *బుచ్చిబాబు, గుర్రంకొండ*

**భాసనాటక కథలు ప్రచురిస్తూయుండడము ముదావహము. మిగత భాసుడి నాటక కథలు ప్రచురిస్తారని ఆశించవచ్చా?**

అన్నీ కాకపోయినా హెచ్చుభాగం ప్రకటిస్తాము.

8\. *సూరిశెట్టి శంకరనాయుడు, బోజుడి (బీహార్)*

**"అట్టమీది బొమ్మకథ" ప్రస్తుతం అచ్చువేయలేదు. ఎందుచేతనండీ?**

మహాభారతం అట్టమీది బొమ్మకథ కాదా?

9\. *టి. శ్రీరామిరెడ్డి, చెన్నూరు*

**ఎం. టి. వి. ఆచార్య, శంకర్, చిత్రా మొదలగువారిని కలుసుకోవలెనని కుతూహలమగుచున్నది. వారి అడ్రసులు తెలుపండి.**

వారంతా "చందమామ"లో పనిచేసేవారే. వారికి రాయవచ్చు.

10\. *వెంపల రామకృష్ణరావు, ఉనకరమిల్లి*

**అన్నయ్యా, మన "చందమామ" సంస్థకు నెలకు కవరులు, కార్డులు సుమారు ఎన్ని వచ్చును?**

ఆశ్చర్యకరమైన ప్రశ్నే! సమాధానంకూడా పాఠకులకు ఆశ్చర్యం కలిగించవచ్చు: "చందమామ" కార్యాలయానికి ప్రతినెలా వచ్చే కార్డులు, కవర్లు, బుక్‌పోస్టుల సంఖ్య 8 వేలకు పైగా ఉంటుంది!

11\. *వావిలాల సుందరి, తిరుమల*

**అమెరికా, రష్యాలు చంద్రమండలానికి వెళ్ళడానికి ప్రయత్నాలు చేస్తున్నాయికదా, మన దేశం ఎందుకు చేయదు?**

నెలనెలా రెండులక్షలమంది "చందమామ"ను ఇంటికి పట్టుకుపోతూండటం చేతనేమో!

# చిత్రకథ



ఒకరోజున దాసూ, వాసూలు బడి నుంచి తిరిగి వస్తూండగా, దారిలో వాళ్ళకు ఒక కుర్రవాడు కలిశాడు. వాడివెంట పెద్ద కాట్లకుక్క వున్నది. అది, 'టైగర్'ను చూస్తూనే పెద్దగా మొరిగి దాని వెంటపడింది. దాసూ, వాసూలు ఎంతచెప్పినా, ఆ కుర్రవాడు తన కాట్లకుక్కను పిలవనన్నాడు. ఈలోపల 'టైగర్' కాట్ల కుక్కకు అందకుండా పరిగెత్తి, తాపీవాళ్ళు కడుతున్న ఒక గోడమీదికి ఎగిరింది. కాట్లకుక్క కూడా గోడమీదికి ఎగరబోయేంతలో, అక్కడవున్న సున్నంబొచ్చె 'టైగర్' కాలికి తగిలి, అదికాస్తా కాట్లకుక్క నెత్తిన బోర్లాపడింది. సున్నంతో శరీరం అంతా తడవటంతో, అది కుయ్యోమని అరుస్తూ పారిపోయింది.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


దిన
దినానికీ
దిన
దినానికీ
ది...
రెక్సోనాలో కేడిల్ -
చర్మమును పోషించుచూ, దానిని అతి
సొగసుగాను...అతి నునుపుగాను,
అతిమృదువుగాను వుండునట్లు చేయు
నట్టి చర్మసౌందర్యమును గలిగించే
నూనెల ప్రత్యేక మిశ్రమం వున్నది!
రెక్సోనాయొక్క ప్రత్యేక పరిమళం,
మీకు రోజల్లా హాయిగొలుపును!
సౌందర్య సహకారియైన
రెక్సోనా రోజూ వాడండి!
Rexona
BLENDED WITH CADYL
రెక్సోనా సబ్బు మీ చర్మమును అతి సొగసుగానుంచును
RP.164-50 TL
ఆస్ట్రేలియాలోని రెక్సోనా ప్రొ.లి., తరపున భారతదేశంలో తయారుచేయబడినది.

# బాధ నివారణకు సంతోషముగు విధానము

నోపిన్ చక్కటి చేతి నిర్ది దారను మూస్తును—పోయి చేయుంటా చెమటలు కారువట్లు కాదు.

నోపిన్ చర్మమును మార్చ బొబ్బలు పొక్కనివ్వదు. మందులు ఎల్లప్పుడు వాడు అలవాటు చేయదు.

నోపిన్ చేయు విధానము ప్రఖ్యాత వైద్యుల చేత విజ్ఞాన శాస్త్రంచేత చేయబడి. ఎల్లప్పుడు బాగా సీలు చేసిన ట్యూబులలో నుండును.

# నోపిన్

ది కలకత్తా కెమికల్ కం. లిమిటెడ్, కలకత్తా—29.
1916 నుండి దేశమును సేవించుచున్నది.



ఎల్లప్పుడు ఒక
నోపిన్ ట్యూబును
అందుబాటులో
ఉంచుకొనుడు
కండరముల నొప్పి
తల నొప్పి
బెణుకు,
గుండె జలుబు,
మొ. వాటినుండి
సత్వర విముక్తి
నిచ్చును.




దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

---



మీ

పాపాయికి

ఇష్టం

# స్పెన్సర్స్ గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ వ్యాధులకు




ఆంధ్ర రాష్ట్రానికి సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

## ది స్వతంత్రా ఏజెన్సీస్,

రామవిహార్, హనుమాన్‌పేట, విజయవాడ-2.

Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

మేకపాలనే త్రాగెను నిత్యం

పంపినవారు:
R. A. V. R. మూర్తి - వైజాగ్

CHANDAMAMA (Telugu) MAY 1960 Regd. No. M. 4854




మార్కోపోలో సాహసయాత్రలు